

# కావ్యమాల

( బి. ఏ. పద్యభాగము – 1962 )




విద్యారత్న

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు,

యం. ఏ., ఏ. ఇ. యస్. (రిటైర్డు)

( రాజమహేంద్రవరమున గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీలో ప్రాచ్యభాషా శాఖాధ్యక్షులుగా నుండెడివారు. )

సంపాదకులు, సంస్కృత ఎకాడెమీ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.





ప్రకాశకులు

శ్రీరామా బుక్ డిపో

సికింద్రాబాదు.

1960

శ్రీ

# కావ్యమాల

( బి. ఏ. పద్యభాగము — 1962 )




విద్యారత్న

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు,

యం. ఏ., ఏ. ఇ. యస్. (రిటైర్డు)

( రాజమహేంద్రవరమున గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీలో ప్రాచ్యభాషా శాఖాధ్యక్షులుగా నుండెడివారు. )

సంపాదకులు, సంస్కృత ఎకాడెమీ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.





ప్రకాశకులు

శ్రీ రామా బుక్ డిపో

సికింద్రాబాదు.

**1960**

# దుష్యంత మహారాజు చరిత్ర.

## మహాభారతము (చతుర్థాశ్వాసము)

—నన్నయ.

వ. ......(పూరువంశంబునందు) ఋక్షునకుఁ దక్షకపుత్త్రి యయిన జ్వాల యనుదానికి మతిసారుండుపుట్టె. 1.

క. ఇమ్ముగ సరస్వతీ తీ
రమ్మునఁ బండ్రెండు వత్సరమ్ములు విధిమా
ర్గమ్మున సద్గుణ సముదా
యమ్మెసఁగఁగఁ జేసె సత్త్రియాగము నిష్ఠన్. 2.

క. అతనికి సరస్వతీనది
మతి ననురక్తయయి వాని మానుగఁ దనకుం
బతిఁ జేసికొనియె; ధర్మ
స్థితి నయ్యిరువురకుఁ ద్రిసుఁడు ధీరుఁడు పుట్టెన్. 3.

వ. ఆ త్రిసునకుఁ గాళింది యనుదాని కిలిలుండు పుట్టె; వానికి రథంతరి యనుదానికి దుష్యంతుండు పుట్టెఁ; బుట్టి యనన్య సాధారణ గుణ యుక్తుండై. 4.

క. బాలహరిణములఁ బట్టెడు
లీలను విషమాటవీ చలిత కేసరి శా
ర్దూలేభ శరభములఁ దన
బాలత్వమునంద యెగిచి పట్టుచు మఱియున్. 5.

క. ఉర్వీరుహ నివహముతోఁ
బర్వతములు పెఱికి యొండు పర్వతములపైఁ
బర్వఁగ వైచుచు యౌవన
గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుండై. 6.

శా. ఆ దుష్యంతుఁ డనంత సత్త్వుఁడు సమస్తాశాంత మాతంగ మ
ర్యాదాలంకృతమైన భూవలయ మాత్మాయత్తమై యుండఁగా,
నాదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో
నాది క్షత్త్రచరిత్రనేలె నజితుండై బాహువీర్యంబునన్. 7.

క. ఆతని రాజ్యంబున ను
ర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజా శో
కాతంకక్షయ శంకా
పేతంబై ధర్మచరితఁ బెరుఁగుచు నుండెఁ. 8.

వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయా వినోదార్థియయి యాదిత్య
హయంబుల కంటె వడిగల వాహంబులు పూనినరథంబెక్కి యాజా
నేయ తురంగారూఢులైన యాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంత
కుంతశక్తి చాప కృపాణపాణు లయిన వీరభట సహస్రంబులతోఁ
జని వనంబులోని మృగంబులం జుట్టిముట్టి; 9.

క. కలయఁగ నార్పును, బొబ్బయు,
నులివున నవ్వీపిన మనుమహాదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంత మహా
బలమందరనగము సత్త్వభయ జనకంబై. 10.

క. సరభస పరిచలితమహా
శరభ ద్విపరిపు వరాహ శార్దూల మద
ద్విరదాది ప్రకర భయం
కర వనమధ్యమున నృపతి గడుఁ గడిమి మెయిన్. 11.

క. ఓసరిలి పఱచు మృగముల
నేసియు, డాసిన మృగముల నెగిచి భుజాసిన్
వ్రేసియుఁ జంపెను మృగయా
వ్యాసక్తి నపారఘోర వన్యమృగాలిన్. 12.

వ. ఇట్లు పెక్కు మృగంబుల నెగిచి చంపెడి వేడుక నతిదూరంబున కరిగిన, నాతని రథవేగంబు ననుగమింప నోపక యధిక క్షుత్పిపాసా పరవశులయి పచాతు లయ్యాయి ప్రదేశంబుల విశ్రమించి; రంత దుష్యంతుండు కతిపయామాత్య పరిజన పురోహిత సహితుండై కొండొక నేల యరిగి ముందట నొక్క పుణ్యనదీతీరంబున వివిధ సురభికుసుమ ఫలభార వినమ్ర తరులతాగుల్మ పరిశోభితంబయిన యొక్క వనంబుఁగని. 13.

క. అమరవతి ఖాండవమునకు,
రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమా
నముగా దీనిని భూభా
గమునకు రచియించెనొక్కొ కమలజుఁడు దయన్. 14.

వ. అని దాని రమణీయ భావంబుఁ బొగడుచుఁ జనుదెంచి యవ్వనంబు సొచ్చునప్పుడు. 15.

చ. అతిరుచిరాగతుండయిన యాతనికిన్ హృదయప్రమోద మా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలావ వ
ర్జిత కుసుమాక్షతావళులు సేసలు పెట్టిన యట్టిరైరి, సం
పతదళినీ నినాద మృదుభాషల దీవనలొప్ప నిచ్చుచున్. 16.

వ. మఱియును. 17.

క. కాఱడవిఁ బఱచు మృగముల
నూఱడకం దిగిచి డస్సి యున్నతని శ్రమం
బాఱఁగ నెడఁ బరితాపము
దీఱఁగఁ బై వీచె నన్న దీ పవనంబుల్. 18.

మాలిని :—

ఏచి తనర్చి తలిర్చినకోవుల నిమ్మగుతావుల జొంపములం,
బూచిన మంచి యశోకములన్, సురపొన్నలఁ, బొన్నల, గేదఁగులం,

గాచి పెడంగుగఁ బండినయూసహాకారములం, గదళీతతులం
జూచుచు వీనుల కింపెసఁగఁగ విను చున్ శుకకోకిల సుస్వరముల్. 19.

కవిరాజవిరాజితము :—

చనిచని ముందట నాజ్యహవిర్హుత సౌరభ ధూమలతాతతులం
బెనఁగిన మ్రాఁకుల కొమ్ములమీఁద నపేతలతాంతములైనను బా
యని మధుప ప్రకరంబులఁ జూచి జనాధిపుఁడంత నెఱింగెఁ దపో
వన మిది యల్లదె దివ్యమునీంద్ర నివాసము దా నగునంచు నెడన్, 20.

వ. ఇట్లు హృదయ సుఖావహంబగు చున్న యవ్వనంబులో నరిగి యరిగి యనవరత పఠక్రమ మహోద్విజ పఠ్యమాన వేదధ్వనులను, నవిచ్ఛిన్నహూయ మానాగ్నిహోత్ర స్వాహా శబ్దంబులను, ననేకముని గణప్రణీతవచన విషయవిభాగ వినిర్ణయ న్యాయనిపుణ విద్వత్సంభాషణ ఘోషంబులను, బ్రతిపక్ష దుర్భేధ ప్రమాణ విచార్యమాణ వేదార్థ మీమాంసక గోష్ఠీవివాద నాదంబులను జేసి మ్రోయుచు యజ్ఞప్రయోగ ప్రవీణులైన యాజ్ఞికులకును, విహితానుష్ఠానాసక్తులయిన యనుష్ఠాతలకును, నధికతపోనిరతులయిన మహా తపోధనులకును నివాసంబయిన పుణ్యానదీతీరంబునఁ దద్దయు రమ్యంబయి గంగాతీరంబున నరనారాయణస్థానంబునుంబోలె జగత్పావనం బగుచున్న కణ్వమహాముని యాశ్రమంబుగని యందు,21.

సీ. శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులును, గరికర
శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణముల చల్లనిగాడ్పాసపడి వానిఁ
జెంది సుఖం బున్న సింహములును,
భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టునీ. వారాన్న పిండతతులు

గీ. గడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొండుసహజ
వైరి వర్గంబులయు సహావాస మపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది. 22.

వ. ఇక్కాశ్యపుం డైన కణ్వమహా మునీంద్రునకు నమస్కరించి వచ్చెద,
నావచ్చు నంతకు నందఱు నిచ్చోటన యుండునది యని. 23.

చ. వలయు నమాత్యులం దగినవారల నుండఁగఁ బంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చని, తన్విఁ, బయోజదళాయతాక్షి, సం
కులమిళితాళి నీలపరి కుంచిత కోమల కుంతలన్, శకుం
తల యను కన్యకం గనియెఁ దన్ముని వల్లభు మందిరంబునన్. 24.

వ. అదియును వసంతవిలాసంబున జయంతుండ పోని దుష్యంతు నెఱింగి
యతి సంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాది విధులం బూజించి కుశలం
బడిగి యున్న నక్కన్యకం జూచి దుష్యంతుం డిట్లనియె. 25.

ఉ. క్రొచ్చర వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి, నెందుఁ బోయిరొకో వా? రనినన్ విని యాలతాంగి వా
రిచ్చట నుండి యీ క్షణమ యేఁగిరి కానకుఁ బండ్లుదేర, మీా
వచ్చు టెఱింగి రేని జనవల్లభ వారును వత్తు రింతకున్. 26.

వ. వారు వచ్చునంతకు నొక్క ముహూర్తం బుండునది యనిన విని
యక్కోమలి వినయంబునకు, మృదు మధుర వచనంబులకు, సంతసిల్లి
దానిం గన్యకఁగా నెఱింగి నీ వెవ్వరి కూఁతుర? విశిష్టరూప లావణ్య
విలాస విభ్రమ గుణసుందరి విందుల కేల వచ్చి? తని యడిగిన నది
యిట్లనియె. 27.

శకుంతల దుష్యంతునకుఁ దన జన్మక్రమం బెఱింగించుట.

క. జగతీవల్లభ యేన,
త్యగణిత ధర్మస్వరూపుఁడని జనములు దన్
బొగడఁగ జగదారాధ్యుం,
డగు కణ్వ మహామునీంద్రు నాత్మజ ననినన్, 28.

చ. ఇది మునికన్యయేని, మఱి యేలొకొ యీ లలితాంగి యందు నా
హృదయము దద్దయుం దవిలె ? నివ్వలు కింకను నమ్మ నేర న
య్యెద, విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక విందునంచు దా
నిదికలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁ డయ్యె నాత్మలోన్. 29.

వ. ఇట్లు దుష్యంతుఁ డాశకుంతల జన్మం బెఱుంగ వేఁడి వెండియు దాని
కిట్లనియె. 30.

తే. ఉత్తమాశ్రమ నిష్ఠితుఁ, డూర్ధ్వరేతుఁ,
డైన కణ్వమహాముని యనఘచరితుఁ,
డట్టిముని కెట్లు గూఁతుర వైతి ? దీని
నాకు నెఱుంగఁగఁ జెప్పుము నలిన నేత్ర. 31.

వ. అని యడిగిన నారాజునకు శకుంతల యిట్లనియె. 32.

క. 'ఇక్కమలాక్షి శకుంతల
యెక్కడి యది? దీని జన్మ మెవ్విధ?'మని త
మ్మొక్క మునినాథుఁ డడిగిన
నిక్కార్యపు లర్థిఁ జెప్పి రేను వినంగన్. 33.

వ. నా జన్మప్రకారంబు మాయయ్య యమ్మునికిం జెప్పినవిధంబు చెప్పెదఁ
జిత్తగించి వినుమని యాదుష్యంతునకు శకుంతల యిట్లనియె. 34.

సీ. అనఘుఁడు రాజర్షి యై, తపశ్శక్తి మై
బ్రహ్మర్షి భావంబుఁ బడసియున్న
సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోర
తపము సేయుచునున్నఁ దత్తపమున
కెంతయు వెఱచి దేవేశ్వరుఁ డప్సరో
గణములలో నగ్ర గణ్యయైన
దాని మేనక యను ధవళాక్షిఁ బిలిచి
విశ్వామిత్రుపాలికిఁ జని తదీయ

ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన
దేవరాజ్య మహిమఁ దివిరి నీవు
గావు మనిన నదియుఁ గడు భయంపడి యమ
రేశ్వరునకు మ్రొక్కి యిట్టులనియె. 35.

చ. వనజ భవప్రభావుఁ డగువాని వసిష్ఠు నపత్యశోక మ
న్వాన నిధిలోన ముంచిన యవారిత సత్త్వుఁడు, నిన్నుఁ దొట్టియీ
యనిమిషులెల్ల వానికి భయంపడు చుందురు, రట్టి యుగ్రకో
పనుకడ కిప్పు డేఁగు మన పాడియె యిప్పని నన్నుఁ బంపఁగన్ 36.

ఉ. అమ్మౌని యల్గి చూచుడును నాక్షణమాత్రన గోత్రధారిణీ
ధ్రమ్ములువ్రయ్యు, నయ్యుసుము దక్కఁగ సంబుధు లింకు, మూఁడులో
కమ్ములు దిర్దిరం దిరుగు, గాడ్పు చలింపఁగ నోడు నుగ్రతం
బమ్మిన యట్టి కోప పరుపాలికి భామలు వోవ నోడరే? 37.

వ. అయినను నా నేర్చు విధంబున నమ్మునివరు చిత్తంబు మెత్తన చిత్త
జాయత్తంబగు నట్లుగాఁ జేసెద నని వాసవు వీడ్కొని మేనక తనకు
మందమలయానిలంబు దోడుగాఁ జనుదెంచి హిమవత్పర్వత
ప్రదేశంబునఁ దపంబు సేయుచున్న విశ్వామిత్రు తపోవనంబు
సొత్తెంచె నంత 38.

క. చల్లని దక్షిణ మారుత
మల్లన వీతెంచెఁ దగిలి యాలలనా ధ
మ్మిల్ల కుసుమాంగ రాగస
ముల్లసన సుగంధి యగుచు మునివరుమీఁదన్ 39.

చ. అనిమిషకాంతయున్ నవలతాంత విభూషణలీల నల్లన
ల్లన వనకేళి లాలస విలాస గతిం జనుదెంచి ముందటం
గనియె మునీశ్వర ప్రవరుఁ, గౌశికుఁ, గౌశిక చిత్తభీతి సం
జనన మహాతపశ్చరణ సంయతచిత్తు, నిరస్తచిత్తజున్. 40.

క. అంబుజలోచన గని విన
యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పాపచయ వ్యా
జంబున విహరించు చుండె సఖులుం దానున్. 41.

వ. క్రమముగ న త్తరుణి తన సౌందర్య వచోవిలాసాదుల నమ్మునివల్లభు డెందము నావర్జింపఁగల్గె. అయ్యిద్దఱకు నిక్కన్యకపుట్టిన దీని మాలిని యను నొక్కయేటి పులినతలంబునం బెట్టి మేనక దేవలోకంబునకుం జనియె. విశ్వామిత్రుండును దపోవనంబునకుం జనియె, నంత నమ్ముని ప్రభావంబున, 42.

ఆ. చెలఁగి లేవ నేడ్చు చిఱుతుకఁదాని గ్ర
వ్యాద ఘోరమృగము లశనబుద్ధిఁ
బట్టకుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు
కొని శకుంతతతులు గూడియుండె. 43.

వ. అంత నేము శిష్యగణంబులతోడ సమిత్కుసుమఫలాహారణార్థం బక్కడకుంజని యమ్మాలినీ పులినతలంబున శకుంతరక్షితయై యున్న కూఁతు, నత్యంతకాంతిమతి, నవనీతలంబున కవతరించిన తరుణశశి రేఖయుంబోనిదాని నెత్తికొని వచ్చి శకుంతరక్షిత యగుటంజేసి శకుంతలయను నామంబిడి కరంబు గారవంబునం బెంచితిమి. 44.

మధురాక్కర :—

తనర జనకుండు, నన్న ప్రదాతయును, భయత్రాత
యును ననఁగ నింతులకు మువ్వురొగిన గురువులు, వీర
లనఘ యుపనేత మఱియు, నిరంతరాధ్యాపకుండు
ననఁగఁ బురుషున కిద్యేవు రనయంబును గురువులు. 45.

వ. అనఁ బరఁగిన శాస్త్రార్థంబున నేము దీనికి భయత్రాతల మగుటం చేసి గురుల, మిదియును మాచే నభివర్ధిత యగుటంజేసి మాకు

హృదయానందని యైన కూఁతురని కణ్వమహాముని యమ్మునికిం జెప్పినవిధం బంతయు సవిస్తరంబుగా శకుంతల సెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున. 46.

దుష్యంతుఁడు శకుంతలను వివాహంబు సేసికొనఁ గోరుట.

చ. ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్రి నని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పద నెఱిఁగించినన్ మదనబాణ పరంపర కిప్పు డుండనా
స్పద మయి సంచలించె నళిపాతవికంపితపంకజాకృతిన్. 47.

వ. అనుచు మదనాతురుం డయి దుష్యంతుండు దనయం దక్కోమలి యనురాగం బుపలక్షించి యిట్లనియె. 48.

క. ఈవల్కలాజినములకు,
నీవన్యఫలాశనముల, కీ విటపకుటీ
రావాసములకు నుచితమె
యీవిలసిత రూపకాంతి నిర్మల గుణముల్? 49.

ఉ. ఈమునిపల్లె నుండుటిది యేల? కరం బనురాగ మొప్పఁగా
భామిని నాకు భార్యవయి భాసురలీల నశేషరాజ్యల
క్ష్మీమహనీయసౌఖ్యముల మేలుగ చెందు మనింది తేందుపా
దామల తుంగహర్మ్యముల హారిహిరణ్మయ కుట్టిమంబులన్. 50.

సీ. బ్రాహ్మంబు, దైవంబుఁ, బరఁగ నార్షంబు,
బ్రాజాపత్యమును, రాక్షసంబు, నాసు
రంబు, గాంధర్వంబు, రమణఁ బైశాచంబు,
నను నెనిమిదివివాహములయందుఁ
గడుఁ బ్రశస్తములు సత్క్షత్త్రివంశ్యులకు
గాంధర్వ రాక్షసములు ధర్మయుక్తి,
నీకును నాకును నెమ్మిఁ బరస్పర
ప్రేమంబు గాముండు పెంపఁ దొడఁగెఁ,

గాన నెడయుఁజేయఁగా నేల గాంధర్వ
విధి వివాహ మగుట వినవె యుక్త,
మనిన లజ్జఁజేసి యవనతవదనయై
యాలతాంగి యిట్టులనియెఁ బతికి. 51.

క. కరుణానిరతులు, ధర్మ
స్వరూపు, లింతకు మదీయ జనకులు సనుదెం
తురు, వారు వచ్చి నీ కి
చ్చిరేనిఁ బాణిగ్రహణము సేయుము నన్నున్. 52.

వ. అనిన దానికి దుష్యంతుం డిట్లనియె. 53.

తే. తనకుమఱి తాన చుట్టంబు, దాన తనకు
గతియుఁ, దన్నిచ్చుచోఁ దాన కర్తయుసఁగ
వనజనేత్ర గాంధర్వ వివాహ మతిర
హస్యమును నమంత్రకమును నగుచునొప్పు. 54.

వ. అని దుష్యంతుండు గాంధర్వ వివాహస్వరూపంబు సెప్పి శకుంతల
నొడంబఱిచిన నది యిట్లనియె. 55.

చ. వరనుత నీప్రసాదమున నాకుదయించిన నందనున్ మహీ
గురుతర యౌవరాజ్యమునకున్ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో,
నిరుపమ దాన యట్లయిన నీకును నాకును జెల్మియయ్యెడిన్. 56.

వ. అనిన విని శకుంతల కెంతయు సంతోషంబుగా దాని కోరిన వరం
బిచ్చి, గాంధర్వ వివాహంబున నభిమతసుఖంబు లనుభవించి,
యక్కోమలి వీడ్కొని, నిన్నుఁ దోడ్కొని రా నస్మత్ప్రధాన
వర్గంబుఁ గణ్వమహామునిపాలికిం బుత్తెంచెదనని యూఱడ నొడివి,
దుష్యంతుండు నిజపురంబునకుం జనియె; నిట శకుంతలయుఁ దన
చేసిన దాని మునివరుం డెఱింగి యలిగెడునోయని వెఱచుచుండె.

అంత నమ్మహాముని వనంబుననుండి కందమూల ఫలంబులు గొని చనుదెంచి లలిత శృంగార భావంబున లజ్జావనతవదనయు, నతిభీత చిత్తయునై యున్న కూఁతుం జూచి తన దివ్యజ్ఞానంబున నంత వృత్తాంతంబు నెఱింగి క్షత్రియులకు గాంధర్వవివాహంబు విధిచోదితంబయని సంతసిల్లి శకుంతల కిట్లనియె. 57.

తే. తల్లి నీకులగోత్ర సౌందర్యములకుఁ
దగినపతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ
మయ్యె, నీదుగర్భమున వాఁడఖిల భువన
వహన మహనీయుఁడగు చక్రవర్తినుమ్మ. 58.

వ. నీధర్మ చరితంబునకు మెచ్చితి, నీవు గోరిన వరంబిచ్చెద వేఁడుమనిన శకుంతలయు నాచిత్తం బెప్పుడు ధర్మువు నంద తగిలి యుండను, నాకుద్భవిల్లెడు పుత్త్రుండు దీర్ఘాయురైశ్వర్య బలసమన్వితుండును వంశకర్తయుఁగాను వలయు ననిన నమ్మహాముని కరుణించి దాని కోరిన వరంబిచ్చి యథాకాలవిధుల గర్భసంస్కార రక్షణంబులు సేయించి యున్నంత వర్షత్రయంబు సంపూర్ణంబైన శకుంతలకు భరతుండుదయించి కణ్వనిర్వర్తిత జాతకర్మాది క్రియాకలాపుండయి పెరుఁగుచుఁ గరతలాలంకృత చక్రుండును, జక్రవర్తి లక్షణలక్షితుండును, సింహసంహననుండును, దీర్ఘబాహుండును, ననంత జవసత్త్వసంపన్నుండునునై పరఁగుచు. 59.

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరు వరాహ వ్యాళ శార్దూల ఖ
డ్గ మదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంత భూ
జములందోలిన కట్టుచుం బలిమిమై శాకుంతలుం డొప్పె వ
న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాశైశవ క్రీడలన్. 60.

వ. ఇట్లు వనంబులోని సర్వసత్త్వంబులను దన మహాసత్త్వంబునం జేసి దమియించుచున్న యాతనిం జూచి యాశ్చర్యంబంది ఋషులెల్ల నుత్సు

తెల్ల నాతనికి సర్వదమనుండను నామంబుఁ జేసిరి. కణ్వమహా మునియు నక్కుమారు నుదార తేజోరూప విక్రమగుణంబులకు సంతసిల్లి వీఁ డఖిలభువన యావ ద్రాజ్యాభిషేకంబునకు సమర్థుండగు దెంచెనని విచారించి యొక్కనాఁడు గూఁతున కిట్లనియె. 61.

ఆ. ఎట్టి సాధ్వులకును బుట్టినయిండ్లను
బెద్దకాలమునికి తద్ద తగదు;
పతుల కడన యునికి సతులకు ధర్మువు,
సతుల కేడుగడయుఁ బతుల చూవె. 62.

కణ్వమహాముని శకుంతలను దుష్యంతుపాలికిం బంపుట.

వ. కావున నీ విక్కుమారునిం దోడ్కొని నీపతిపాలికి నరుగుమని మహా తపోధనులైన తన శిష్యులం గొందఱఁ దోడు వంచిన శకుంతలయు దావ్యంతిం దోడ్కొని దుష్యంతుపాలికి వచ్చి సకలసామంత మంత్రి పురోహిత ప్రధాన పౌరజన పరివృతుండై యున్న రాజుంగనుంగొని.

క. గురునాశ్రమంబునను ము
న్నరుదుగఁ బతివలనఁ గనిన యనురాగము, నా
దరణము, ననుగ్రహంబును,
గరుణయు, సంభ్రమము నవుడు గానక యెడలోన్. 64.

క. ఎఱుఁగఁ డొకొ నన్ను, నెఱిఁగియు
నెఱుఁగని యట్లుండునొక్కొ, యెడ దప్పుగుటన్
మఱచెనొకొ, ముగ్ధులధిపులు
మఱవరె బహుకార్యభార మగ్నులుగారే. 65.

చ. తలఁపఁగ నాఁడు వల్కినవిధం బెడఁదప్పఁగ జూచెనొక్కొ! చూ
డ్కులు విసరంబులై కరము క్రూరములైన నిమిత్త మేమియో?
కలయఁగ బల్కరించి రుపకారులునై రని నమ్మి యుండఁగా
వలవదు బుద్ధిమంతులు నవప్రియులైన ధరాధినాథులన్. 66.

వ. అని తలంచి చింతాక్రాంతయై శకుంతల వెండియు నాత్మగతంబున.

క. మఱచినఁ దలఁపింపఁగ నగు,
నెఱుఁగని నాఁడెల్ల పాటనెఱిగింపనగుఁ,
మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమల గర్భునివశమే! 68.

వ. అయినను వచ్చి మిన్నక పోవంగాదు, కావున నా పూర్వవృత్తాంతం బెల్ల నెఱింగించి యేనిక్కమారుం జూపుదునని మనంబున నిశ్చయించి శకుంతల యా రాజున కిట్లనియె. 69.

క. జననాథ వేఁటనెపమునఁ
గొనకొని కణ్వాశ్రమమునకుఁ వచ్చి ముదం
బున నందు నాకు నీయి
చ్చిన వరము దలంపవలయుఁ జిత్తములోనఁ. 70.

క. బాలార్క తేజుఁడగు నీ
బాలుఁడు నీకొడుకు, పీనిఁ బౌరవకుల ర
త్నాలంకారు, నుదార గు
ణాలయు యువరాజుఁ జేయు మభిషేకముతోఁ. 71.

వ, అనిన విని దుష్యంతుండు దాని నంతయు నెఱింగియు నెఱుంగని వాఁడపోలె నిట్లనియె. 72.

క. ఏనెఱుఁగ నిన్ను, నెక్కడి
దానవు? మిన్నకయ యనుచితంబులు వలుకం
గానేల? యరుగు మంబురు
హానన యెందుండివచ్చి తందులకు వడిన్. 73.

వ. అనిన విని వెలవెల్లనై వెచ్చనూర్చి నిశ్చేష్టితయై కెందమ్మి రేకుల వలనం దొరంగు జలకణంబులపోలెఁ గోపారుణిత నయనంబుల

బ్రాహ్మణములు దొరఁగం దలవాంచి యారాజుం గటాక్షించుచు హృదయ సంతాపంబు దనకు దాన యుపశమించుకొని పెద్దయుం బ్రొద్దు చింతించి శకుంతల యారాజున కిట్లనియె. 74.

ఆ. ఏల యెఱుక లేని యితరులయట్ల నీ
వెఱుఁగ ననుచుఁ బలికెఁ దెలిఁగి యెఱిఁగి?
యేనకాని దీని నెఱుఁగ రిందొరులని
తప్పఁ బలుక నగునె ధార్మికులకు? 75.

చ. విమల యశోనిధీ పురుషవృత్త మెఱుంగుచు నుండుఁ జూవె వే
దములును, బంచభూతములు, ధర్మువు, సంధ్యలు, నంతరాత్మయుఁ
యముఁడును, జంద్రసూర్యులు, నహంబును, రాత్రియు నన్మహాపదా
ర్థములివి యుండఁగా నరుఁడు దక్కొనఁనేర్చునె తన్ను ముచ్చిలన్?

క. నాయెఱిఁగినట్ల యిన్నియు
నీయిచ్చిన వరము ధారుణీవర యెఱుఁగుఁ,
నాయందుఁ దొంటిచుట్టుల
చేయుమనుగ్రహ, మవజ్ఞ సేయందగునే? 77.

క. సతియును, గుణవతియుఁ, బ్రజా
వతియుఁ, ననువ్రతయు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతిరు
ర్మతి కిహముం బరముం గలదె మఱిఁ బరికింపఁ! 78.

క. సంతత గృహమేధి ఫలం
బంతయుఁ బడయంగ నోపుననుగుణ భార్యా
వంతుండగువాఁడు, క్రియా
వంతుఁడు, దాంతుండుఁ, బుత్రవంతుండునగుఁ. 79.

వ. మఱియును, 80.

సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు,
గృహనీతివిద్యకు గృహము, విమల
చారిత్ర శిక్షకాచార్యకం, బన్వయ
స్థితికి మూలంబు, సద్గతికి నూఁత,
గౌరవంబున కేక కారణం బున్నత
స్థిరగుణమణుల కాకరము. హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లుగావు ప్రియము

ఆ. లెట్టిఘట్టముల, నెట్టి యాపదలను,
నెట్టి తీఱములను ముట్టఁబడిన
వంతలెల్లఁ బాయు వింతలఁ బ్రజలను
నొనరఁ జూడఁగనిన జనులకెందు. 81.

వ. మఱియు భార్య పురుషునం దర్ధంబగుటఁజేసి పురుషునకు మున్న పరేతయైన పతివ్రత పరలోకంబునం దనపురుషుంగూడఁ దదాగమ నంబు ప్రతీక్షించుచుండుఁ, బురుషుండు మున్నపరేతుండైనఁ బదం పడి తానును బరేతయై తనపురుషుంగూడ నరుగు. అట్టిభార్య నవ మానించుట యధర్మంబు. మఱియునుం బురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్త్రుండై తాన యుద్భవిల్లుఁగావున "నఙ్గా దఙ్గా త్సంభవసి" యనునది యాదిగాఁగల వేదవచనంబులయందును జనకుండును బుత్త్రుండును నను భేదంబులేదు. 82.

క. విను గార్హపత్యమును న
య్యనలము విహరింపఁబడి తదావహనీయం
బన వెలుఁగునట్ల వెలుఁగును
జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్. 83.

క. తాన తననీడ నీళ్ళల
లోనేర్పడఁ జూచునట్లు లోకస్తుత త

త్స్యను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయప్రీతి మెయిన్. 84.

వ. 'పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్ర' యను వేదవచనంబుగలదు గావునఁ బుణ్యాచారుండయిన పుత్త్రుం డుభయపక్షంబులవారి నుద్ధరించుఁగావున. 85.

క. నీ పుణ్య తనువు వలనన
యీ పుత్త్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పెన్,
దీపంబువలన నొండొక
దీపము పుట్టించినట్లు తేజం బెసఁగన్. 86.

మ. విపరీత ప్రతిభాష లేమిటికి నుర్వీనాథ యీ పుత్త్రగా
త్ర పరిష్వంగసుఖంబు సేకొనుము, ముక్తాహార కర్పూర సాం
ద్ర పరాగ ప్రసరంబుఁ, జందనముఁ, జంద్ర జ్యోత్స్నయుం బుత్త్రగా
త్ర పరిష్వంగ మునట్లు జీవులకు హృద్యంబే? కడున్ శీతమే? 87.

క. అనఘుఁడు వంశకరుండై
పెనుపున నీ సుతుఁడు వాజపేయంబులు నూ
ఱొనరించు నని సరస్వతి
వినిచె మునులు వినఁగ నాకు వినువీథి దెసన్. 88.

క. భూరి గుణు నిట్టికుల ని
స్తారకు దారకు నుదార ధర్మప్రియ
నిష్కారణము తప్పఁ జూడఁగ
సారమతీ చనునె నాఁటి సత్యము గలుగున్. 89.

చ. నుత జలపూరితంబులగు నూతులు నూఱిటికంటె నూనృత
వ్రత యొక బావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు, తత్క్రతు శతంబునకంటె సుతుండు మేలు, త
త్సుతు శతకంబుకంటె నొక సూనృత వాక్యము మేలు సూడఁగన్. 90.

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును, నొక్క సత్యమును, నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము
వలనన ములు నూపు గౌరవంబున పేర్మిన్. 91.

తే. సర్వతీర్థాభి గమనంబు, సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁ గావ,
యెఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు. 92.

క. కావున సత్యము మిక్కిలి
గా విమలప్రతిభఁ దలఁచి కణ్వాశ్రమసం
భావిత సమయస్థితి దయఁ
గావింపుము కొడుకుఁ జూడు కరుణాదృష్టిన్. 93.

క. క్షత్త్రివరుఁడైన విశ్వా
మిత్త్రునకుఁ బవిత్రమైన మేనకకున్ స
త్పుత్త్రినయి బొంకుపలుకఁగ
ధాత్రీతలనాథ యింత ధర్మేతరనే? 94.

వ. అనిన శకుంతల పలుకులు సైకొన నొల్లక దుష్యంతుఁడిట్లనియె. 95.

క. ఏనెట? నీవెట? సుతుఁడెట?
యేనెన్నఁడుఁ దొల్లిచూచి యెఱుఁగను నిన్నున్,
మానిను లసత్యవచనలు
నానిట్టు లసత్యభాషణం బుచితంబే? 96.

క. పొడవునఁ, బ్రాయంబునఁ, గడుఁ
గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ
కొడుకని యీతని నెంతయు
నెడ మడుగుగఁ జూపఁదెత్తె యిందఱు నగఁగాన్? 97.

వ. ఇట్టి లోకవిరుద్ధంబులకే మోడుదు, మయుక్తంబులయిన పలుకులు పలుకక నీ యాశ్రమంబునకుం బొమ్మనిన శకుంతల యత్యంత సంతాపితాంతఃకరణయై. 98.

మధ్యాక్కర :—

తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి, నిప్పుడు పతిచేతను విడువఁబడియెద నొక్కొ ?
నుడువులు వేయు నింకేల ? యిప్పాటినోములు దొల్లి
కడఁగి నోఁచితిని గాకేమి యనుచును గందె డెందమున. 99.

వ. ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశయై బోరనఁ దొరఁగు బాష్పజలంబులందంద యొత్తికొనుచు నింక దైవంబకాని యొండు శరణంబులేదని యప్పరమ పతివ్రత తనయుందోడ్కొని క్రమ్మఱ పోవనున్న యవసరంబున. 100.

చ. గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు, సే
కొని భరియింపు మీతని, శకుంతల సత్యమువల్కె, సాధ్వి స
ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయ మందగఁ దత్సభాసదుల్. 101.

వ. ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతల పతివ్రతాత్వంబును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రశంసించు వేలుపులపలుకు లతివ్యక్తంబులయి యాకాశమార్గంబువలన వీతెంచిన విని దుష్యంతుండు సభాసదులు విన నిట్లనియె. 102.

తే. ఏను నీయింతియునుగాని యెఱుఁగరన్య
లర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబు
నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము
నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము. 103.

తే. అన్యులెఱుఁగమిఁ జేసి లోకాపవాద
భీతి నెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతిదప్పి
యెఱుఁగ నంటిని, యిందఱ కిప్పు డెఱుఁగఁ
జెప్పెనాకాశవాణి యచ్చెరువుగాఁగ. 104.

వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్షపులకలెసఁగ నాలింగనంబు సేసి శకుంతలామహాదేవి నతి ప్రణయగౌరవంబున సంభావించి యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుం జేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి తన రాజ్యభారంబంతయు భరతునిఁబూన్చి దుష్యంతుండు దపోవనంబున కరిగె. 105.

---

# 2. కిరాతార్జునీయము.

(హరవిలాసము – సప్తమాశ్వాసము)

—శ్రీనాథుఁడు.

ఉ. అర్జునుఁ డింద్రకీల గిరి – యందు రసాల తమాల తాలనీ
పార్జున లోధ్ర తిందుక వ – టామలకీ పనసామ్ర పాటలీ
సర్జ కురంట కామ్ల హరి – చందన చందన నింబ కేతకీ
భూర్జ కపిత్థ పూగముఖ – భూరుహ పుణ్యత మాశ్రమంబునన్. 1.

క. ద్యూత పరాభవమున నగు
చేతో దుఃఖమునఁ దపము – చేయఁగఁ దొడఁగెన్
భ్రాతల యనుమతి శత్రు
వ్రాత జయార్థంబు మది దివ – స్పతి గుఱిగాన్. 2.

మ. ధనురస్త్రంబులు కేలఁ దాల్చి శరధి – ద్వంద్వంబు నేర్పార వీ
పున బంధించి కిరీటియై కవచి యై – పూనెం దపశ్చర్య య
ర్జునుఁ డత్యంత గరిష్ఠ నిష్ఠ నమరేం – ద్రుం గూర్చి యయ్యింద్రకీ
ల నగాగ్రంబునఁ బ్రత్యనీక విజయ – శ్లాఘాభిలాషంబునన్. 3.

క. వంచన మనంబులోన నొ
కించుకయును లేక యుమ్మ – హేంద్రము మీఁదన్
బంచానల మధ్యంబునఁ
బాంచాలీ వల్లభుఁడు త – పంబొనరించెన్. 4.

తే. గాండివము తోడ నొక యోగ – దండ యష్టి,
యస్త్రములతోడఁ గొన్ని ద – ర్భాంకురములు,
కత్తళము తోడఁ బుండరీ – కంబు తోలు
దాల్చి క్రీడి విరుద్ధపుఁ – దపము జేసె. 5.

శా. శాకాహారుఁడు, నిర్జితేంద్రియుఁడు, పా - షాణాగ్రతల్పుండునై
నాకేశప్రియనందనుండు సలిపె - న్నానా ప్రకారంబులన్
వాకుం, జిత్తము, దేహము న్సరియె కా - నానా తపశ్చర్యలన్
వ్యాకీర్ణోరగ సింహ భల్లుక లులా - యాభీలశైలాటవిన్. 6.

సీ. పతయాళు నిర్ఝరాంభః ప్రవాహంబుల
నఘమర్షణస్నాన మాచరించుఁ,
గొండగోఁగుం బూల గుండవర్ధనముల
నర్చించు శశిలాంఛ నార్ధవహాళి,
స్ఫటికాక్షమాలికా పాణిప్రవాళుఁడై
జంభారి మంత్రంబు జపము చేయు,
నొంటికాల బుజంబు మూర్ధ్వంబుగాఁ జాఁచి
తడవుగా నిలుచుండి తప మొనర్చు,

తే. శరభ శార్దూల సింహాది సత్త్వ చయము
కెరలి తనమీఁద బిట్టు లంఘించునపుడు
కడిమిఁ జెండాడు భుజదండ గాండివోగ్ర
చండతర శాత నిర్ఘాత కాండ వితతి. 7.

తే. వీరరస గర్భితంబయ్యు విస్తరిల్లె
శాంతరస మెంతయును సవ్యసాచియందు,
మలయశైల నితంబ మండలమునందు
సర్పవేష్టిత చందన శాఖజమట్లు. 8.

వ. ఇవ్విధంబునఁ గపికేతనుండు గాండివజ్యాఘాత రేఖాకిణకళంకాలంకారంబులగు కరంబులు నీవార పాకంబునకును, పాంచాల కన్యకా కుచ కుంభకుంకుమప్రక్షోద సంప్రేక్షణీయంబైన వక్షంబు రుద్రాక్షధారణంబునకును, నంగార పర్ణ కర్ణ కఠోర హుంకార కారణంబగు కంఠంబు మహేంద్ర దేవతా మంత్రాక్షర ధారణంబునకును, ఖాండవ

దహనవేళా విజృంభితావష్టంభ సంరంభంబగు హృదయాంభోరు హంబు ప్రణవోపలంభంబునకును, గుంభసంభవప్రదిష్ట శాఖాశిఖర పక్షిలక్ష్యావలోకన జాగరూకం బగు వీక్షణంబులు నాసికాపరిదే శాను సంధానంబునకును, యంత్రమత్స్య విభేదనోపాయ సందర్శన పరిభావ సంసిద్ధి యగు బుద్ధి వృద్ధోపసేవనంబునకును, గంగాజల నిగ్రహానుగ్రహోపాదన సమగ్రంబగు మానసోత్సాహం బింద్రియ భంగంబునకును, నుత్తర దిగ్విజయ యాత్రాధురీణంబులగు చరణం బులు తీర్థగమనంబులకును బాల్పడఁ జేసి జగజెట్టి బిరుదు నెట్టుకొనం దండ్రిగుణించి తపంబుఁ జేయుచుండ దినంబులు గడచె, వారంబు లరిగెఁ, బక్షంబులు సనియె, మాసంబులు వోయె, ఋతువు లతిక్రి మించె, సంవత్సరంబు దాఁటె నయ్యవసరంబున. 9.

సీ. తెల్లనిగడ్డంబు, తెల్లని మీసము,
ల్నరసిన రోమపాండుర శిరంబు
మేదావి బొట్టును, మెఱుఁగు జన్నిదములు,
భూతి లలాట త్రిపుండ్రకంబుఁ,
గావి దోవతియును, గంధోత్తరీయంబు,
నిష్టికోలయుఁ, జంక నిట్టితోలుఁ
బంచాంగ ముష్టియుఁ, బాణిపవిత్రంబు,
నొక్క వ్రేలికి వెండి యుంగరంబు,
తే. జాఱుబొజ్జయుఁ, గుశదర్భ సంబెలయును,
నెడమచేతను నిడుగోలు గొడుగుదాల్చి
తనకు సజ్జాతిగా నొక్క తపసి వృద్ధ
బ్రాహ్మణుఁడు వచ్చె నొయ్యొయ్యఁ బార్థుకడకు. 10.

వ. వచ్చి యాశీర్వదించి మహాత్మా! నీ సంగడంబునం దపంబు చేయ వచ్చితి నిచ్చోఁ గొన్ని దినంబులు క్రూరజంతువులు నన్నుఁ బాధింప

కుండ సరసికొని యుండపలయు నని పల్కి యతని ముందటఁ
బరిశ్రాంతుఁడుం బోలెఁ జతికిలం బడి కూర్చుండెడి. 11.

తే. మోఱకుని చందమున నీఱ-తాఱచూపు
పాండవేయునిపైఁ దార్చి-బ్రాహ్మణుండు
. పలికె నిప్పచ్చరంబైన భావణములఁ
పరమ నాస్తిక భావంబు పరిమళింప. 12.

తే. అన్న! యెవ్వరి వాఁడ? వీ-యడవిలోనఁ
దపము సేసెదు, నీ మంత్రి-తంత్రవిధులు
పాకశాసన దేవతా ప్రార్థనైక
సూచకము లైనయవి యెన్ని-చూడ నిపుడు. 13.

ఉ. చక్కని వాఁడ, వెంతయును జల్లని వాఁడవు, భాగ్యరేఖఁ బెం
పెక్కిన వాఁడ, వీ విపిన మెక్కడ? నీ సుకుమారతా గుణం
బెక్కడ? ఘోరవీర తప మీా యెలప్రాయమునందుఁ జేయునే
యక్కట! యెవ్వఁడైన? నకృతాత్ముఁడ వీవాకరుండు దక్కఁగన్.

క. శరచాప ధారణంబుల్,
బరమ మనశ్శాంతి, దాంతి పరిపాకంబున్
బరికింపఁ "జంక దుడ్డును
శరణార్థియు" ననెడు నట్టి చందము దోఁచెన్. 15.

క. వైరి మదకుంభి కుంభ వి
దారణ దారుణ కృపాణ ధారలు, పరిఘా
కారములు, కందమూలో
ద్ధారములకుఁ బాలుపడెఁ గదా నీకరముల్! 16.

శా. ఈ భద్రాకృతి, యుమ్మహాభుజయుగం, బీ దీర్ఘకోదండ, మీా
యాభీలత్వ, మొకండొకండ భువనైకాధ్యక్షతా హేతువే
లాభం బాత్మఁ దలంచి చేసెదొకో గోలాంగూల భల్లూక మ
త్తేభాకీర్ణ వనాంతరంబునఁ దపం బేకాగ్ర్య భావంబునన్? 17.

తే. ఈశ్వరునిఁ గూర్చి జేసెద వేని లెస్స,
మాధవుని గూర్చి చేసిన మాట హితవు,
బ్రహ్మఁ గూర్చి చేసిన నది ప్రార్థ్యతరము,
తగునె యిల వజ్రిధరుఁ గూర్చి తపముసేయ ? 18.

తే. ఎవ్వఁడుపదేశ మిచ్చె నీ కింద్రుఁగూర్చి
తపము సేయుము నీవంచు దయదలిర్ప ?
నాతఁ డెఱుఁగఁడో కాక యా యదిరిభేది
గౌతముని యింటఁ జేసిన కామ గోష్ఠి ? 19.

సీ. ఆ సహస్రాక్షుని యాత్మసంశుద్ధికిఁ
బరమ సంయమి యింటి పంచసాక్షి,
యా నిర్జితేంద్రు బాహా విక్రమమునకు
భుజగాంతకుని యోఁశ పోక సాక్షి,
యా సునాసీరు నహంకార గరిమకు
నిమథాచలము మీఁది నెలవు సాక్షి,
యా శచీవల్లభు నౌచిత్య కలనకుఁ
దాపసుచేతి పూదండ సాక్షి,
తే. యిట్టి దేవేంద్రుఁ గూర్చి నీవింత తపము
చేసి పడసెదవేమి వాంఛిత ఫలంబు ?
వాఁడు నీకంటె నేమిట వాసిగలఁడు ?
తగదు చాలింపు మీ విరుద్ధంపుఁ దపము. 20.

వ. అని యెంతచెప్పిన నత్యంత ధీరోదాత్తుండగు పాండుపుత్త్రిం డూరక
తపంబు చేయుచుండె. నట్టి యేకాగ్ర భావంబునకుం బ్రియుంబంది
వృద్ధబ్రాహ్మణ వేషంబుమాని వృద్ధశ్రవుండు ప్రత్యక్షుంబై వరంబు
వేఁడు మనుటయు. 21.

క. గురు భీష్మ కర్ణ సైంధవ
గురు తనయులతోడఁ గూడఁ గురుపతి బలము
న్బరిమార్చునట్టి సత్త్వముఁ
బురుహూతా! యిమ్ము కరుణ బొంపిరి వోవన్. 22.

వ. అనిన, నిందుఁడు సవ్యసాచి కిట్లనియె. 23.

తే. భీష్మ గురు కర్ణ కృపు లనిర్భేద్య బలులు,
ద్రౌణి భూరిశ్రవో భగదత్త శల్య
సైంధవులు పేరుగలవారు, సమరజయము
శంభుకృప లేక యెబ్బంగి సంభవించు? 24.

వ. పశుపతి గుఱించి తపంబు సేయుము, తత్ ప్రసాదంబున నీకు జయం బయ్యెడుఁ; బునర్దర్శనంబు కాఁ గలయది, పోయివచ్చెద నని యిందుఁడంతర్ధానంబు చేసె. 25.

తే. తండ్రి చెప్పిన మాట లొంఁ దప్పనాక
యాదరించి ధనం జయుం డభవుఁ గూర్చి
యింద్రకీలా చలంబుపై నేక నిష్ఠ
ధీరుఁ డొనరించె నతి ఘోర వీరతపము. 26.

మ. భసితోద్ధూళిత నిర్మలావయవుఁడు, న్బంచాక్షరీ సంతతా
భ్యసన వ్యాప్తి పరాయణుండును, శివ ధ్యానాను సంధాతయున్,
మసృణస్నిగ్ధ తరక్షు చర్మమయకం థా భద్రపీఠుండునై
యసమస్థేమఁ గిరీటి పాశుపత దీ క్షారంభముం గైకొనెన్. 27.

సీ. ప్రథమ సంధ్యారాగ పరిపాటి మిన్నేటి
కనక పంకజ కోర కములు దెలుపఁ,
గందువాఱిన మించుఁ గంచుటద్దము వోలె
విధు మండలము కాంతి వీడు కొనఁగ

దరమైన వేఁబోక తఱపి వెన్నెలఁ గ్రోలి
దివిఁ జకోరములు మ త్తిల్లియాడ,
మందరాచల కూట మధ్య భాగమ్మునఁ
గృత్తికా నక్షత్ర మత్తమిల్ల,

తే. మృదుల భస్మరజశ్శయ్య మేలుకాంచి
యమల రుద్రాక్ష ధారణం బాచరించి
యర్జునుఁడు పర్ణశాలికా భ్యంతరమున
హరున కొనరించు నరుణోద యార్చనంబు. 28.

క. కపికేతుఁ డింద్రకీల
ప్రపాత పతయాళు నిర్ఝ ర స్నాతుండై
యుపచార విధుల నన్నిటఁ
దపనోదయవేళ వ్యాళధరుఁ బూజించున్. 29.

మ. అవధానంబునఁ బాకశాసన సుతుం డర్ధేందుకోటీరు సం
గవ కాలంబునఁ బూజసేయు హిమవాః కర్పూర కస్తూరికా
ద్రవ కాలాగురు గంధసార సురభి ద్రవ్యంబులం, బూవుల,
న్లవలీ సర్జరసాగురు ప్రముఖ నా నాధూప ధూమంబులన్. 30.

శా. పంచ బ్రహ్మ షడంగ బీజసహిత ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్ర పరంపరా పరమ ని ష్ఠా తత్పర త్వంబునన్
మంచుం గొండయనుంగుఁ బెండ్లి కొడుకు న్మధ్యాహ్న కాలంబు సే
వించు న్నిర్జర రాజసూనుఁడు మనో వీథీ సదా ధ్యాసితన్. 31.

శా. వైయాఘ్రాజిన ఖండ మధ్యమున శేవన్ బద్ధ పద్మాసనుం,
డా యింద్రాత్మజుఁ డింద్రకీల శిఖరీం ద్రారూఢ బిల్వాద్రు మ
చ్ఛాయా నిర్మల చంద్రకాంతమణి పాషాణ ప్రదేశంబున
న్సాయంకాలము పూజ సేయు నభవు న్సంధ్యానటున్ ధూర్జటిన్. 32.

ఉ. అంచిత భక్తితో శివుని నర్ధనిశా సమయంబునందు సే
వించు గురూపదేశ పదవీ పరిశుద్ధ సమర్చనా విధిన్
గాంచన కోరకంబుల, శుక ప్రసవంబులఁ, గొండ గోఁగులన్
గాంచన కందరా గృహాము ఖంబులఁ బార్థుఁడు సంస్కృతార్థుఁడై. 33.

వ. ఇట్లు కాలకంధరుం గుఱించి తపంబు సేయుచుండఁ గొండొక
కాలంబునకు. 34.

మ. ఒకనాఁ డింద్రతనూభవుండు గిరికూ టోత్సంగ భాగంబున,
న్వికచానేక లతాతరుప్రతతులన్ దేవార్చనా పుష్పకో
రకము ల్గోయుచు నుండఁగా వినఁబడెన్ శ్రవ్యంబులై కుర్కుర
ప్రకరోదంచిత కంఠనాళకుహలీ బౌబౌ మహారావముల్. 35.

తే. శరభ మృగముల కంటెఁ, గే సరుల కంటెఁ,
బులుల కంటెను బిసరులై పొగరు మిగిలి
జల్లుకొని వచ్చెఁ బైపైని సారమేయ
యూథములు వేదమయ మూర్తు లుద్ధతముగ. 36.

తే. ప్రకటలీల నుదాత్తంపు ఫణితిఁ గొన్ని,
క్రమముతో ననుదాత్త స్వ రములఁ గొన్ని,
స్వరితములఁ బ్రచయంబుల వరుసఁ గొన్ని
ఘోషణము సేయఁ దొడఁగె నా కుర్కురములు. 37.

క. కనకపు శృంఖలలఁ ద్రయీ
శునకంబులఁ బట్టుకొనఁగ సూరెలఁ బ్రమథుల్
తను నిరు చక్కియ లీలా
వనచరులై కొలువఁ గపట వైహారికుఁడై. 38.

సీ. వికట పాటల జటా మకుటికా భారంబు
కట్టైన జుంజురు నెఱులుగాఁగఁ,
జారు సుధాధామ శకలా వతంసంబు
పెడకొప్పుపై నుండు పీఁకె గాఁగ,

ఘన లలాటంబునఁ గనుపట్టు కనుచిచ్చు
గైరికద్రవ తిలకంబు గాఁగ,
భుజ మధ్యమునఁ గ్రాలు భుజగ హారంబులు
గురిజ పూసల గుబ్బ సరులుగాఁగ,

తే. శంకరుండు గిరాత వేషంబు దాల్చి
యగజ చెంచెత యై తోడ నరుగు దేరఁ
బాణి నోంకార దివ్య చాపము ధరించి
వచ్చె విజయుండు వర తపో వనము కడకు. 39.

వ. అట్టి సమయంబున. 40.

చ. జలధర నీల దేహమును, జంద్రకళా యుగళీ సమాన దం
ష్ట్రలు, భిదురోపమాన ముఖ సంపుట పోత్రము, ఫుల్ల మేచకో
త్పలదల వర్ణ కర్ణములు, పాటలవర్తుల లోచనంబులుం
గలిగి కఠోర కంఠ ఘన ఘర్ఘర ఘట్టన ఘోష జన్మమై. 41.

ఉ. ముట్టియ నింద్రకీలతట మూలమహీ ప్రభవంబులైన పె
న్బుట్టలు గ్రొచ్చివైచుచును, భూరుహ షండముఁ జాఁపకట్టుగా
మట్టుచు, ఘర్ఘర ధ్వనుల మాటికి మాటికి దిక్పుటంబులన్
ఘట్టన చేయుచు, న్వాఁడఁద కన్నుల నిప్పులు వెళ్లఁగ్రాయుచున్. 42.

క. పంది వడిఁ బాఱుదెంచెఁ బు
రందర నందను నిశాకరధ్వజు నడుమన్,
దందడి గొరిజల తాఁకునఁ
గందుకములు వోలె శిలలు గరువాఱంగన్. 43.

ఉ. ఏసెఁ బినాకచాపమున నీశుఁడు, గాండివ కార్ముకంబునన్
వాసవసూతి, యాప్రబల వజ్రసమానములైన బాణముల్
రాసెఁ బరస్పరంబును వరాహము ప్రక్కలు గాడిపాఱ మూ
కాసుర సూకరంబు దిరుగాడె వడి స్మరఘాత వేదనన్. 44.

క. అభవార్జున శరపాత
ప్రభవవ్యథఁ దిరిగె నవ్వరాహము కడు సం
క్షుభితమయి విలయవేళా
నభస్వ దుద్భ్రాంత ఘనఘనాఘనము క్రియన్. 45.

క. దీర్ఘతర హారవరాశుగ
నిర్ఘాత నిపాతజాత నిబడవ్యథ సం
తర్ఘూర్ణమాన మగుచును
ఘుర్ఘుర ఘోషంబుతోడఁ గ్రోడము గూలెన్. 46.

వ. అప్పుడు, గిరాత వేషధారి యగు పురారి యోంకార చాపంబు నేల నిలువంబెట్టి, తదీయ శిఖరంబున నఱచేయిమోపి యొరగి, యొయ్యా రంపు నిలుకడ నిలిచి, వలకేల వాలమ్ము ద్రిప్పుచుఁ గట్టెదుర నున్న జగజెట్టి యగు నింద్రుని పట్టిం గనుంగొని, ప్రావృషేణ్య పయో వాహ గర్జాగంభీరంబైన స్వరంబున నింద్రకీలగిరి గహ్వరంబులు ప్రతిధ్వనియొసఁగ, సాటోపంబుగా, సగర్వంబుగా, సావష్టంభంబుగా నిట్లనియె. 47.

తే. ఎవఁడవు రోరి? నీవు! నా యెదురఁ బాఱు
పంది నేసితి బాహు దర్పంబు మెఱసి.
యెఱుఁగవుర యోరి! నన్ను నీ యింద్రకీల
పర్వతంబేలు వనచర సార్వభౌము? 48.

ఉ. ఏనును నాకుటుంబమగు నీతరళాక్షియు వేఁట వెళ్ళి యి
క్కానన భూమిలో బహు మృగంబులఁ జంపుచు వచ్చివచ్చి యే
మీ నిశితాస్త్రపాతమున నిక్కిటిఁ జంపుదు మంచు వాక్ప్రతి
జ్ఞా నియమంబున న్వెనుక జాడఁగ గూడఁగ వచ్చుచుండగన్. 49.

క. ఏటలవి నేసి చెంచెత
యోటమి పెట్టం గడంగి యున్నట్టి యెడన్,

గా చెలువున గోఱ తిడి యిట
చీటంబున వేడ్క యెల్లఁ జెఱచితి కదరా! 50.

తే. తపసి వైయుండి తగు రోరి ధనువుఁబట్ట?
శాంతిపరులకు నేలరా సత్త్వ హింస?
కపట ధార్మిక! యత్యంత కల్మషాత్మ
యెవ్వఁడవు రోరి నా పంది నేయ నీవు? 51.

క. మండెడు బలు నారసమున
గుండియ పగులంగ నేసి కూల్చితి దీనిన్
వెండి ప్రయోజన మేదీ
రండాసుత! దీనిపై శరము నిగుడింపన్? 52.

చ. తబిసివిగాన చావునకుఁ దప్పితి, నీకిది వేఁట పంతమా?
యబసరపుం దెఱంగునఁ బరాటవికాయత చాపవల్లరీ
నిబిడ శరాహతం బగు వనేచర జంతువు నేసి తీగతిన్
సబముపయి న్నిగుడ్చిన నిశాతశిలీముఖ మెట్టి వెఱ్ఱిదో? 53.

వ. అనినం గిరీటి యయ్యాటవిక చక్రవర్తికిట్లనియె. 54.

క. పైఁ వచ్చు కూ్రర జంతువుఁ,
జే వెరవున నేయు టెందు సెగ్గే చెపుమా?
యీ వక్రభాషణంబులు
నీ వాడెదు శబర! పొమ్ము నీ చనుత్రోవన్. 55.

క. పంది నపేక్షించెదవో?
పందెము గెలువంగ వేడ్కపడియెదవా? యెదో!
కందువుగా కాఫలము పు
ళిందాధిప! యేమిటికి బలికె దీ భంగిన్? 56.

మ. తడవౌదెంచె పుళిందరాజ! చను, మధ్యాహ్నంబు డాయంగ న
య్యేడు, నీవేళ శివార్చనంబునకు మా కేకాంశమైయుండఁగాఁ

బడు, నీవుం గడుడస్సినాఁడ వటవీవ లక్ష్య ప్రచారంబులన్,
విడు కోపం, బిదె శాంతిఁగైకొనుము వాగ్వివాద మింతేటికిన్. 57.

క. జోటియు, నీవును, గుక్కుర
కోటియు, ననుచరులు డప్పి గొన్నారు మహా
ధాటి పరిశ్రమమున ని
చ్చోట వసించెదర యేని సుఖముండదగున్. 58.

వ. అని యర్జునుండు పల్కిన, నా గజ్జులాఁడు మోటుకంబున మొగ మడ్డంబు గదల్చి, యీ వెడమాటలం బనిలే, దీ పంది యొక ప్రయోజనంబె? వేఁట పంతంబు దప్పి మమ్ము నధిక్షేపించితి, వీ తప్పునకుఁ దపసివి గాన నిన్ను శిక్షింపను, పొమ్మదియునుంగాక. 59.

ఆ. తాటియంత విల్లు ధరియించినాఁడవు,
జ్యాకిణాంకితము భుజాయుగంబు,
గర్వరేఖ మిగులఁ గానంగ నయ్యెడు,
దాంభికంబు నీదు తబిసి తనము. 60.

శా. ఏమో నా హృదయంబు నిన్నుఁ గని యిట్లిచ్ఛా పరాధీనమై
భామా సన్నిధి నుబ్బుచున్నయది, నీ బాహా ప్రతాపంబు ని
స్సీమంబేనొక కొంత సేపిచట నుజ్జృంభించిరాఁ జేయుమా!
నామీఁదన్ని గుడింపుమా నిశిత నానాక్రూర నారాచముల్! 61.

క. చెంచని నన్నుం జూడకు,
వంచింపకు హీనజాతి వాఁడని, సంగ్రా
మాంచలమున నిదె నను మె
చ్చించెదవే నపుడు నిన్ను సేబా సందున్. 62.

మ. శివలింగార్చన మెందువోయెడుఁ! దపస్విత్వమ్ము నెందే నుప
ద్రవముం బొందదులే యొకింత వడిలో, ధ్యానాను సంధానముల్
వ్యవధానం బొకయింత సైఁచవొకొ? బాహావిక్రమ శ్రీమహో
త్సవముం జూపుదుగాక నా యెదుర నాశ్చర్యం బవార్యంబుగన్. 63.

తే. ప్రదర మరిహోయు, మేయుము, ప్రాక్ప్రకార
కౌతుకాధీన హృదయుండఁ గాదె నేను ?
వీరకుల పత్నియైన యీ నీరజాక్షి
యాసపడుచుండు ఘోర వీరాహవములు. 64.

వ. అని పల్కి యా క్రీడాకిరాతుండు గుణధ్వనిచేసిన, జలధర ధ్వాన గంభీరంబై యేతెంచు నామ్రోఁతకు సిళ్ళు చూపినఁ గోపించు గంధ ద్విపంబుంబోలె రోషించి, యర్జునుండు గాండీవగుణ గర్జాడంబరంబున నంబరంబు పిక్కటిల్ల నా టక్కరి విలుకానిపై భల్లంబులు నిగుడించె. 65.

శా. గాండీవప్రవిముక్త నిష్ఠుర మహాకాండ ప్రకాండంబులన్
ఖండించె న్బ్రతిబాణ ఘట్టనమునం గందర్ప విద్వేషి యా
తండాశ్చర్యము నొంది బాపురె? పుళిందశ్రేష్ఠయంచు న్భుజా
దండాహంకృతి వెండియుం బఱపె శాతక్రూర నారాచముల్. 66.

శా. ప్రారంభం బొకయింత లేకను తృణప్రాయంబు నట్లొందఁగాఁ
గ్రూరాజిం దెగ నేసెనో నఱికెనో క్రొవ్వాఁడి ఱంపంబుచే
నీరీతిం దునుమాడ వచ్చునె యనన్ హేలాగతిం ద్రుంచె దు
ర్వారాహంకృతి నీశ్వరుండు విజయాస్త్రవ్రాతమున్ వ్రేల్మిడిన్.

క. శితికంఠుఁడేయు శరములు
ప్రతిహతములు సేయు నరుఁడు, పార్థుని శరముల్
శితికంఠుఁడు నిజశరములఁ
బ్రతిహతములు సేయు బహుళ బాహా ప్రౌఢిన్. 68.

క. క్రూరతర హరనరాశుగ
నారాచ శిలీముఖాది నానాస్త్రఘటా
నీరంధ్రమైన నభమునఁ
గారుకొనియె గాఢ మంధకారము దిశలన్. 69.

క. ఓంకార గాండివ జ్యా
టంకారంబులు నభః కటాహము నిండెన్
శంకర కపికేతు భుజా
హంకార నిరంకుశాహవాంగణ భూమిన్. 70.

వ. ఇట్లోహరిసాహరి నల్లాడు హరార్జునులయందు. 71.

క. శరధులు యుగాంతవేళా
శరధులునుం బోలె నయ్యె శరశూన్యంబుల్
సురపతి సూతికిఁ బరమే
శ్వర మాయాశక్తి నపుడు సమరాగ్రమునన్. 72.

మ. తెలివిం బొందక యుండె నెమ్మనమునన్ దివ్యాస్త్ర మంత్రాక్షరం
బులు, శారద్వత కుంభసంభవుల సంబోధంబు సర్వంబు ని
ష్ఫల మయ్యెన్, వృథ యయ్యె నాంతరకృతాభ్యాసంబు గాండీవికిన్
గలహక్షోణిఁ బినాకపాణి కుహనా కౌటిల్య శిల్పంబునన్. 74.

క. నిటల విలోచన మాయా
ఘటనమునఁ గిరీటి తన ప్రగల్భత చెడినన్
గుటిలముగ బొమలు ముడిచెను,
గటకటఁ బడఁ దొడఁగె నపుడు కరము సెమర్చెన్. 74.

శా. కాండక్షీణత నాయిషుచ్ఛటలకుం గల్గెంగదే! నా ధనుః
పాండిత్యం బెటువోయె నొక్కొ? యిది చెప్పం జిట్టలోఁ గాక యీ
తం డీలాగునఁ బోవువాఁ డెమయిమైఁ దానంచు గర్వోద్ధతిన్
గాండీవంబునఁ బూన్చి యేయఁ దొడఁగె న్గాండీవి గంగాధరున్. 75.

క. మృడు నెన్నడు తలపైఁ గ
వ్వడి యడవం దొడఁగె గాండివంబున నెడలో
నుడుగక షోడ మెడు భయమున
వడఁకుం గుబ్బలి కుమారి వడవడ వడఁకన్. 76.

సీ. కలుకు వెండ్రికలలోఁ బలుచు మందాకిని
సుకుమార దేహంబు స్రుక్కఁ బాఱె,
నవతంసకుసుమ మా ల్యంబైన శశిరేఖ
బ్రహ్మకపాల రంధ్రమునఁ దూఱె,
నెట్టియంబుగ బిగ్గఁ జుట్టిన పెనుఁ బాము
బిగియూడి నొసలిపై డిగఁగ జాఱె,
నవిక నేత్రము కంది యాతజ్యమానమై
ఱెప్పల సందుల నిప్పు లుమిసె,

తే. నగజ భయమందఁ, బ్రమథులు బెగడుగుదువ,
నుపనిషత్తులు ఘోషింప నొక్క పెట్ట
కాల కంతుని మాళి శృంగాటకంబు
గాండివంబునఁ దాడింపఁ బాండవుండు. 77.

తే. పాండు నందన ఘన భుజా దండకలిత
చండ గాండీవ తాడిత ఖండ పరశు
పృథు జటా మండలంబునఁ బిందు గట్టి
తాండవం బాడె మిన్నేటి తరఁగ పిండు. 78.

తే. వింటఁగొని వ్రేయ వ్రేయంగ విసుగు పుట్టె
జెట్టి బిరు దెంత చూతము పట్టుమనుచు
సురతనూ భవునిం బట్టె శూల పాణి,
మల్ల సంగ్రామ కేళి సంభావనముల. 79.

క. కపికేతు వృషభ కేతను
లుప జాత నియుద్ధకౌతు కోత్సాహమునన్,
నిపుణతఁ బెనఁ గఁగఁ దొడఁగిరి
యుపతాయిక్ గతివిశేష ముపలాస్యముగన్. 80.

తే. తోరహాత్తంబు నందుఁ బా ర్థుండు గడమి
సలిపి యూరులు పీడించె సరభసమున,

హరుఁడు సీసాన హత్తించి యర్జునునకు
బరువు గావించె నిశ్వాస పవనమునకు. 81.

క. ముక్కంటి కంఠమూలము
డొక్కరమున నిఱికెఁ బార్థుఁడు ప్రబంధుండై,
చక్కని ప్రకోష్ఠపీడన
మిక్కిలికను వెలికి నుఱికి మినుమినుకుమనన్. 82.

క. తాచుచుఁ, బొడుచుచుఁ, బడుచును,
నేచుచు, నుఱుకుచును, బిట్టు నెగయుచుఁ గూలం
ద్రోచుచుఁ, దూలుచుఁ బెనఁగిరి
ప్రాచీ పతి సుతుఁడు హరుఁడు బాహా బాహిన్. 83.

శా. నిష్టంకించి శశాంక శేఖరుఁడు గాం డీవాయుధుండు న్భుజా
వష్టంభంబులు సిద్ధచారణులు నై వారంబు గావింపఁగా
దిష్టాంతాంతక ఘోర మూర్తులయి సా దృశ్యంబ దృశ్యంబుగా
ముష్టా ముష్టి రణంబుచేసిరి యస మ్మోహ ప్రకారంబులన్. 84.

క. చెమరుచుట, యూడుగఱచుట,
బొమముడుచుట యే వికార మును లేని పరి
శ్రమమున సరిసరిఁ బెనఁగిరి
సమవిషమ నియుద్ధకేలి శంభుఁడు నరుఁడున్. 85.

క. తాటించెఁ బేరణము, నా
స్ఫోటించెఁ గిరీటి వక్షము వృషాంకుఁ, డతం
డాటోపమెఱక పిడికిటి
పోటున ధూర్జటి యురంబుఁ బొడిచెం గడిమిన్. 86.

శా. అంతం జంద్రకళాధరుండు నిజగాఢాగాఢ పీడా పరి
శ్రాంతుండై యట పాండుసూతి యెదుఱం బ్రత్యక్షమయ్యెం గృపా
వంతుండై యహిరాజ హారములతో, స్వర్వాహినీ వేణితో,
దంతిత్వక్పరిధాన పల్లవముతోఁ, దామ్రజ్జటావంక్తితోన్. 87.

ఉ. చెంచెత యైన పార్వతియుఁ, జెంచులు భూతములు న్నిజాకృతి
న్గాంచిరి, వేలుపు ల్నభము మీఁద లలాటమునందు నంజలు
ల్నించి నమస్కరించిరి, వినీతియు, భక్తియు నుల్లసిల్లఁగా
వించెఁ బ్రణామముల్గరము విస్మయమందుచుఁ బార్థుఁడ త్తఱిన్. 88.

తే. వేదముల్నాల్గు నుపనిష ద్విద్యఁ గూడి
ప్రణవ మంత్రాక్షరములతోఁ బ్రస్ఫుటముగ
విశ్వశబ్దాత్మ మొయ్యొయ్య వీడుకొనుచు
నభినుతింపంగఁ దొడఁగెఁ జంద్రార్ధమౌళి. 89.

వ. అప్పుడు పార్థుఁడు కృతార్థుఁడై, రోమాంచిత కంచుకితాఖిలాంగుం
డును, నానందబాష్పలోచనుండునునై, కేలుదోయి ఫాలభాగంబునం
గీలు గొల్పి యిట్లని స్తుతించె. 90.

క. నీవ పరబ్రహ్మంబవు,
నీ వఖిలాజాండపతివి, నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యాయుః
ప్రావీణ్య ప్రాభవైక ఫలదుఁడవు శివా! 91.

క. నిన్నుఁ ద్రిజగన్నివాసునిఁ,
బన్నగకంకణుని. భక్త పరతంత్రుని, న
భ్యున్నత కరుణాగుణ సం
పన్నునిఁ గనుఁగొంటి మంటి బాలేందుధరా! 92.

క. నీచేతఁ, గృపానిధిచే,
వాచా గోచర వివేక వైరాగ్యునిచే,
నో చంద్రకలాశేఖర!
యాచించి మనోరథార్థ మర్థిం గందున్. 92.

శా. నీకై యేను దపంబుచేసితి మహా నిష్ఠా గరిష్ఠస్థితి,
న్నీకై సంస్తుతిసేయుదుం గడఁగి నా నేర్పొప్పఁగా, నెంతయు
న్నీకై పూజయొనర్తుఁ గ్రొత్తవిరుల న్నిత్యంబు సద్భక్తితో,
నీకై సేవ యహర్నిశం బొనరుతు న్వేదండ చర్మాంబరా! 94.

తే. సాటి యెవ్వరు నీకు నిశ్శాట జఘన?
కైటభారాతి హాటక గర్భవంద్య!
ఘన జటాజూట వాటికా ఘటిత వికట
గగన గంగాస్రవంతిక! కరటివైరి! 95.

క. నీయందు జగము లుండుం
బాయక, యాజగములందుఁ బాయకనీవుం
దీ, యనువు దెలియ నజునకుఁ
దోయజనేత్రునకు నైనఁ దోపదు శర్వా! 96.

మ. జయ సర్వేశ్వర! సర్వలోకజనకా! చంద్రార్ధచూడామణీ!
జయకామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవః కుండలా!
జయ సంపూర్ణ కృపాగుణైక వసతీ! శైలేంద్రజావల్లభా!
జయ దక్షాధ్వరమర్దనా! జయగిరీశా! యీశ! రక్షింపవే. 97.

ఉ. కొండకిరాతుఁ డంచుఁ గయి కోక యసంగత భాషణంబులు
ద్దండత నాడితిన్, గరము దగ్రతనొంచితి ముష్టిఘట్టనం,
గాండివచాపదండమునఁ గ్రచ్చఱ మోదితి మౌళి, భోగ భృ
త్కుండల! పెక్కుచందముల ద్రోహముచేసితి నేమిసేయుదున్. 98.

వ. అని మఱియు మఱియు సాష్టాంగప్రణామంబు లాచరించి నిలిచిన పాండవ మధ్యముం జూచి ఖండపరశుండు, నీ తపంబునకుఁ బాశుపత వ్రత నిష్ఠాగరిష్ఠతకు భుజాశౌర్యంబునకు సంతసిల్లితి, వరంబు వేఁడు మనుటయు. 99.

తే. అభవ! యీ నాకు నీప్సితం బగువరంబు
దయఁ బ్రసాదించి రక్షింపఁ దలఁచితేని
రౌద్రమై ఘోరమై లోక రక్షయైన
పాశుపత సంజ్ఞమగు దివ్య బాణమిమ్ము. 100.

వ. అనినం బ్రీతచేతస్కుండై యీశానుండు వరప్రసాదంబు సేసి యంతర్ధానంబు నందె. 101.

---

# వాల్మీకి మహర్షి.

( వాల్మీకి చరిత్రము – ద్వితీయాశ్వాసము )

— తంజావూరి రఘునాథ భూపాలుఁడు.

గీ. అనుచు నవ్వేంకటాద్రీశు నభినుతించి,
మించి యవ్వలఁ జని మునుల్ గాంచిరంత
నంచితానంద తీర్థసమర్థన సుమ
హాబలంబగు నట్టి యహోబలంబు. 1.

క. కాంచి మునిచంద్రు లచ్చటఁ
జెంచుల దొరయనఁ జెలఁగి చెంచెతల కటా
క్షాంచలముల మరగిన నర
పంచాననుఁ భక్తవరదు భజియించి తగన్. 2.

సీ. హరి యిక్కడనె సామి హరియై
హిరణ్యకశిపుఁ జీఁఱు ఖరనఖశిఖరములనుఁ
బక్షీంద్రుఁడిట మన స్సాక్షికంబుగఁ
దపంబొనరించి విష్ణువాహనత్వఁ జెందె,
గంగ నిర్ఝరులు దిగంగఁ జేయఁగ నిందు
భవనాశనీధుని ప్రభవహించె,
నజ్జాతుఁ డిచ్చటఁ గుబ్జామ్రభూజమై
యమృత జలములు దీనాళికిచ్చె.

గీ. ననుచు నచ్చటి మహిమంబు లభినుతించు
కొనుచు నక్కొండఁ గల తీర్థకుండములను
దానములు చేసి మీఁది నెత్తంబు వెంట
నరిగి యవ్వల నమ్మునుల్ హర్షమెసఁగ, 3.

సీ. రవణిల్లు నెచటఁ గాష్ఠజ్యోతి విద్యోతి
తారణ్య నివహమై యహారహంబు,
నొనరు నెచ్చోటఁ దృణజ్యోతి ఖద్యోతిత
కీటమై ఘనగుహా గేహములను,
గ్రాలు నెచ్చట వాలుకాజ్యోతి సద్యోతి
మోహిత శబర సమూహమగుచు,
నుండు నెచ్చట శిలాజ్యోతి యుద్ద్యోతిత
శృంగంబులను రత్నభంగి నెపుడు,
నలరు నెచట పరంజ్యోతి యతివిశుద్ధ
తరణి మణిశబ్దబిల ధగద్ధగిత భాగ
యోగ సన్నద్ధ బహుసిద్ధ యోగిమతుల
నట్టి శ్రీపర్వతమునకు నరిగిరంత. 4.

క. గంగాది తీర్థజలముల
నంగంబులఁ దొలఁచి మల్లికార్జునునకు నా
రంగ గిరిమల్లికార్జున
రంగత్కుసుమములఁ బూజ రచియించి తగన్. 5.

మ. కనిరంతః భ్రమరాంబికన్ హరిమణీకాదంబ కాదంబినీ
జనిశోభానికురంబ, నంబరచరీ చంచత్కరాంభోజ భా
జన వాలవ్యజనానిలాంకుర చలాంచత్కుంతలం, గాంతలం
ఘన జంఘాల మృగేంద్రవాహన నహీంద్రగ్రైవేయ శాతోదరిన్. 6.

క. కనుఁగొని సాంబశివ స్తవ
మున నమ్మకుటావబద్ధముగ్ధ సుధాంశుః
వినుతించిన నా త్రిభువన
జనకుండును నద్భుతంబు సంఘటిలంగన్. 7.

సీ. చుక్కలదొర రేకఁ జొక్కించుక నిక్కు శిరమునఁ
బదినూఱు చుంగుల పాగఁ జుట్టి,
తఱుచు వెన్నెలలీను తళుకు నెమ్మోముపై
దొలువల్కు లీనెడు తొడవు పెట్టి,
ముద్దులజింక, మునెమ్మొన పోటుముట్టును
సరవితో రెండుహస్తములఁ బట్టి,
పెళపెళమను చెఱుంగుల రంగులడరెడు
మూఁడువన్నెల పట్టుమొలనుఁ గట్టి,

గీ. క్రేళ్లుఱుకు ముత్తియపుఁ జాయ గిబ్బ నెక్కి
చారుతర హార శృంగార హారి యగుచు
ధారుణీధర రాజ నందనయు దాను
నమ్మునీంద్రుల మోళ్ల ప్రత్యక్షమయ్యె. 8.

గీ. ఇట్లు సాక్షాత్కరించి యా ఋషులఁ గాంచి
దాంతి ఘనులార! మీఁదువరాంతిక నుతి
మెచ్చి వచ్చితి, నిచ్చలు నిచ్చ హెచ్చు
కోర్కులెల్లను మీకుఁ జేకూరుగాక! 9.

గీ. ఇదియ కాదన్న నిచ్చట నెందు నెవరు
నెంతమాత్రంబు నుతియింతు రంతలోన
నేను వారికభీష్టంబు లిత్తు వేగ
మౌని వరులార! యీగిరి మహిమ వలన. 10.

వ. అని పలికి భుజంగకంకణుం డా లింగమధ్యంబునం బ్రవేశించె; అంతనక్కాంచనాచల చాపస్వరూపావలోకంబున నానందంబు నొందు చున్న యమ్మునిచంద్రులుం గుటజప్రసూన వాసితంబులగు నుటజ ప్రఘాణంబుల నేణీ డింభంబుల సంభ్రమంబున నక్కడక్కడ జాతి పరికొను కామధేనూ దన్యధారా సారంబులు చవిఁగొని త్రుళ్లిగింత

లిడ వాని వెంబడిం బరువులిడు మునిబాలికల కేళికలు విలోకించి, తదంగణంబున మునిగణంబుల పవిత్రధవిత్రంబుల, హోమధూమం బుల, నతిశ్యామాభి రామంబులగు తరుస్తోమంబు లంబుదకదంబంబు లని మనంబులం బ్రేమయూరనాడు మయూరార్భకంబులలోఁ గొను నశ్మగర్భరశ్మిచ్ఛటాచ్ఛురితంబులగు భూములం గనుంగొనియుం, గనకపత్రస్థానంబులం గానన సీధుకాననలగు భిల్లపల్లవాధరలు భల్లంబులం ద్రెల్ల నేసిన తమ నిసువులంజూచి సంజీవకరణిం దిరుగఁ బ్రదికించి వానితోఁగూడి సంచరించు కాంచన గరుల్లక్షితంబులగు పక్షుల నీక్షించియుఁ, దత్ప్రాంతంబుల నతిశాంతంబులగు శశికాంత శిలాంతరంబుల క్రేవలం గుంభక ప్రభావంబున శిలాంతర బంధులుం బోలె నిశ్చలత్వంబు నెనసి భస్మభసితోద్ధూళితాంగులగు మహా యోగుల బాగులు దర్శించియుం, దత్ప్రవర్తన మహాత్వంబునకు డెందంబున నానందించుచు, 11.

గీ. వింధ్య భూధరమును బయల్ వెడలి యచటి
నఖిలలోకైక శర్మద మైన యట్టి
నర్మదనుఁ గ్రుంకి ముని శరణ్యంబులగుచుఁ
బొదలెడు నరణ్యములు పుణ్యనదులు గడచి, 12.

సీ. ప్రతివీధి సంచరత్పార్వతీ చరణాంబు
జాత నూపుర ఝులంఝుల రవంబు,
విశ్వనాథ విహార వృషభరాజాకుంఠ
కంఠ ఘంటా ఘణంఘణ నినదము,
పటహారవద భంగ భాగీరథీ భంగ
సంగ ఘుమం ఘుమ స్వనభరంబు,
రక్షాధికార భైరవ భుజాస్తంభ గం
భీర ఢక్కా ఢంఢమారవంబు

గీ. సరవి నచ్చోట మోక్షంబుఁ జాటుసిరుల
కాఁపురంబగు నా కాశికాపురంబు
దఱిసి మణికర్ణికాది తీర్థములనాడి
యభవు సేవించి యచ్చట నలరు చుండ. 13.

క. ఆకాశీశ్వరు తా ర్త్రి
నైక విలోచనములందు నెసఁగెడు సెగలే
పైకొనియె ననఁగ లోకం
బాకుల పడఁదోఁచె గ్రీష్మమతి భీష్మంబై. 14.

క. పటపట పగిలెం గుంభిని,
తటతట పథికుల మనంబు తల్లడపడియెన్,
చిటచిట నెగసెను దవశిఖి,
కటకట గ్రీష్మంబొకింత కనఁబడు నంతన్. 15.

చ. బడి చనుదెంచు చాయ ధరఁ బాంథుల తాపముదీఱ నక్కడ
క్కడఁ దరు జాలమూలములు గ్రమ్ముచు నిల్వఁగ, దాని గ్రుచ్చుకో
వడి గరపాళియొత్తి దినవల్లభుఁడల్లన సాఁగె నాఁగ న
య్యెడ నతి దీర్ఘభావమువహించె నహంబులహా! మహోగ్రతన్.

గీ. అట్టి వేసవి బెడిదంపు వెట్ట కతన
నేల నందంద విరిసిన నెఱియలందుఁ
దరణి పాదంబులిడ నెడఁ దవుల మెల్లఁ
దివిచికొనిపోవ దివసంబు దీర్ఘమయ్యె. 17.

చ. ఘనతర కీచకోత్కర ముఖంబులఁ దద్గతభోగి ఫూత్కృతుల్
దనరఁగ నూఁది యోషధి కదంబక చూర్ణము గూర్చి కొండలం
గనకము సేసెఁ దత్సమయ కైతవసిద్ధుఁ డనంగ నెల్లెడం
గనఁగనమించె నెంతయు నఖండ దవాగ్ని శిఖాప్రకాండముల్. 18.

చ. ఖర కిరణోగ్రతాపమునఁ గ్రాఁగి రసాతల భూమిఁ డాఁగి సా
గరములు నింకెనో యనుచుఁ గైకొని చూడఁగ వచ్చిపోవుచుం

దిరుగు సవిమ్యోదంబుల తతిం దలపించఁగఁ జేసె నయ్యెడన్
ధరణి ధరాగ్రజాగ్రదుమ దావముఖోద్గత కీలి ధూమముల్. 19.

ఉ. అబ్బలు వేసవిం ఘనగుహాంతర సీమల రేవగళ్లు మైఁ
బ్రిబ్బెడు నుబ్బ నుబ్బఱఁగ బాటలు దప్పి మొగంబు లెండఁగా
బెబ్బులు లొక్క పెట్టనతి భీకర భాంకృతు లాచరించెనా,
గుబ్బుగఁ గొండ లెండవడఁ గొంకుచుఁ గూఁతలు వెట్టెనోయనన్. 20.

క. సుడిగాలి ధూళిఁ జుట్టుచు
వడిగా నందంద తిరిగె వలయుంబగుచున్
బుడమియను బరణి తెఱ తిరి
గెడు కరణిం జాలనట్టి గ్రీష్మము నందున్. 21.

గీ. ఊష్మలత మించనెంతయు గ్రీష్మసాలి
చండమార్తాండ కిరణాబు శాటిమీాట
నెండమావులు గదలె నుద్దండ గతుల
మృగ కులంబులుగని తృష్ణఁ దగులు కొనఁగ. 22.

క. బడిఁ బఱచు నెండమావుల
నడుమ నపుడుకాలిలోఁ గనంబడు నుద్య
ద్బడ బాగ్ని కీలముల గతిఁ
గడుమించెన్ ధాతువుష్పికా నివహంబుల్. 23.

గీ. పడగ సురటుల నప్పటప్పటికిఁ గొంత
ఫూత్కృతులపేరి గాడ్పులు పొడము చుండఁ
బ్రిదుకుఁ గనేఁగాక భోగులప్పగిది గాక
యుండె నేనట్టి వెట్టచే నుడికి పడవె! 24.

క. ఆతఱి సలిలం బెందును
పాతాళముఁ ద్రివ్వఁగానఁ బడకుండు గతిన్
భీతిల్లు యోగిజనులకు
శీతల కుంభకము గలుగ జీవన మొదవెన్, 25.

సీ. కమ్మవిడెంపులేఁ గారంబు గలమోవి
కండచక్కెర పానకంబులిచ్చి,
చలువ తావులు గుల్కు కలికిలేఁ బల్కుఁగ
వ్రింపుఁ బల్కులను గర్ణములఁ జొనిపి,
జీని పన్నీరు నించిన యట్టి కుచకుంభ
యుగళంబు నక్కుననొత్తి యొత్తి,
పాటల సుమసౌరభంబులు వెదఁ జల్లు
సొగసుఁ బయ్యెద కొంగు సురటి విసరి,

గీ. రమణు లెంతయుఁ దమ తమ రమణుల కను
తాపములు వాపి రొక కొంత తపనుఁ డపుడు
తనదు పండ్రెండు మూర్తుల నెనసినట్లు
కొండలవియంగఁ గందంపు డెండఁగాసె. 26.

క. ఇటులవ్వేసవి యెల్లెడ
జొట జొట నిప్పుకలు గ్రక్కుచో నక్కాశీ
పుటభేదనంబు వెలువడి
యటుచనుచు మునీంద్రు లవల నవలగ్గతులన్. 27.

మ. తమసా నిమ్నగ దాఁటి తజ్జలసముద్యద్బాల శైవాల జా
తనుసారద్యుతి తీర భూరుహ విభాధట్టంబుతోఁ గూడి సం
తమసానీకముఁ బోలె నల్దెసలు నిండంజూచి యోహో! మహా
తమసానీరము నిండెఁ జెల్లదని చింతంజాలఁ బల్కింపుచున్. 28.

గీ. వెదురుములు బూర్గు ములు రేఁగు వెలఁగ వేము
గలివెయుఁ జెలంగ దిగ్గజ కర్ణములను
జెవుడుకొన ఝుల్లికాధ్వని జీండ్రిమనఁగఁ
జీమ దూఱని యొక వన సీమఁగాంచి. 29.

ఆ. మానులచట వారి మార్గంబుగానక
వెదకి వెదకి యల్ల విపిన భూమి

పాపటయునుఁ బోలెఁ జూపట్టు నొకతప్పు
ద్రోవ వెంటనంటి పోవుచవల. 30.

స్రగ్ధర :—

కనిరా మునీంద్ర చంద్రుల్ ఘనరసవద సృక్స్ఫారణా చుంచు పంచా
నన కోపాటోప చంచన్నఖర కులిశ భిన్నత్రుట త్కుంభి రాట్కుం
భ నివేశోన్ముక్త ముక్తా ఫలసర విసరోద్భాసి భిల్లీమతల్లీ
ధనురాస్ఫాల స్ఫురన్ని ధ్వనిజని తమృగీ ధావనంబున్ వనంబున్. 31.

క. కనుఁగొని యోహోహో! యీ
వన మహిమము వేర్యికైన వర్ణింపంగా
జనునే? యటంచుఁ బలుకుచు
మునులందఱు నవ్వనాంతమున నంతటన్. 32.

సీ. తోరణంబులుగ వీథుల నారఁగట్టిన
యుప్పగండలకు నొండొండఁ దిరుగు
పులుఁగుల తెక్కగాడ్పులఁ జాలనెగసెడు
పసరంపుఁ బొలకంపు ముసురుకొనంగఁ
బసివట్టి నలుగడఁ బఱచిన మొకముల
పచ్చితోళ్లను బండ్లగుచ్చి పెఱుకు
బలుజాగిలంబుల భౌ భౌ రవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి

గీ. వరువులిడు నూరఁ బందుల మురికి గవులు
చేఁప తట్టలఁ గదురుతోఁ జెనసి చుట్టఁ
గూఁత వెట్టిన జనుల వాకొలుపఁ జేతు
భయముఁ గొల్పెడు నొక బోయ పల్లెఁగాంచి. 33.

క. చుట్టునుఁ బసరపు టెమ్ముల
తెట్టలు చూచినను మదికి దిగులయ్యెడు హా!

కట్టఁడి దైవం బిచ్చటి
కెట్టుమనలఁ దెచ్చెదాఁటు టెట్లోకో? యనుచుఀ. 34.

క. చండాల వాటికయు నిటు
లుండునె? యీరోఁతఁ గన్న నొక్కట ప్రేవుల్
గుండెలు నిలువక వాంతికి
నొండరిగెడు కర్మఫలమహా! యిటులుండెఀ. 35.

క. నెఱచెదర కరాతులముం
దఱనై నం బోవవచ్చు దయమాలినయి
క్కఱకుఁ గిరాతుల ముందఱ
వెఱవక చనఁ బోలదిచట వెరవెయ్యదియో? 36.

గీ. అనుచుఁగరములు మొగముల కడ్డమిడుచుఁ
గోసినటువలె మనసున రోసి రోసి
గా్రిసియుమియుచు నుడియు దుర్గంధమునకు
నాసికలు మూసికొనుచు సన్న్యాసివరులు. 37.

చ. మిడిమిడి యెండకొట్టునను మేనులు పెట్లుచు నుండ, నేలపై
నడుగులదుమ్ము కుమ్మువలె నంటుకొనఀ, వడిఘర్మతోయముల్
జడిగొనఁగా జటల్ కడవసంబులు మోవఁగ లేక పోవన
య్యెడనొక బోయదాయవలె నెక్కడినుండియొ యద్భుతంబుగఀ.38.

క. బడినేఁగు దెంచి యుఱుమని
పిడుగుంబలె నిప్పులురల బెడిదపుఁ జూపుల్
గడలను జడిగొనఁ గడువడిఁ
బొడమెడు తర్జనల నడవిపులుఁగులు బెగడఀ. 39.

చ. కటినటియించు నీలిబలు కాసెయు, నల్లని మేనుఁ జిమ్మచీఁ
కటి ఘటియింపఁ, జేత విలుగైకొని మేఘపుఁ బిల్లవోలెన
ట్టిటు శరపంక్తులడ్డముగ నేయుచు డాయుచు వచ్చివచ్చి య
జ్జటికుల సార్వభౌములను సాఁగఁగ నీకరికట్టి నిల్చుచుఀ. 40.

క. నిలునిలువుఁడు! మీచేతం
గల సొమ్ముల నెల్లనిచ్చి కదలుఁడు! నాతోఁ
జలపట్టిన మిము నందఱఁ
బలు చట్టలమీఁద నతికి పాఱన్ వైతున్. 41.

గీ. అనిన నవమ్మాను లడికిన నటు కిరాతుఁ
బులుకు పులుకునఁ గనుఁగొని పలుకకున్న
బెడుసుఁ జూపినగాని యేయుడుగ గడుసు
బాపన పిశాచులకు భీతి దోఁపదనుచు. 42.

సీ. తొలుదొల్తఁ గుప్పెగోలలు గొన్ని పైనేసి
యవి నేట్టు పడిపోవ నొడుగఱచి,
గన్నెరాకు ములుకుల్ గొన్ని సూటిగఁ బన్ని
యవి పైకిఁ దేల నహంకరించి,
ఈరేడు చిలుకల గోరులంటఁగఁ జింది
యవియు వమ్మైనచో నదిరి పదిరి,
పారావతమ్ములు పదియైదు నిగిడించి
యవియును దప్పిపో నాగ్రహించి,

గీ. యిన్ని నాళ్ళకు నాచేతి యేటు దప్పె
నౌర! యీజడ దారులకంప తప్పు
కలదు కాఁబోలు ననుచును గఱకు చుఱుకుఁ
జూపులదరంగ నటువారిఁ జుట్టుపాఱి. 43.

సీ. జడల చుట్టకుదిర్చి మెడలపై మోచేత
గుప్పుగుప్పున సారె గుమికి గుమికి,
కక్షపాలలు చించి రక్షకేలను ముంచి
జడియుంగ మొగములఁ జల్లిచల్లి,
సలిలంబు గళగళ తలలమీఁదటఁ బోసి
బుఱ్ఱకాయల నెత్తి పొడిచిపొడిచి,
కడవసంబుల రెమ్మ పెడమర్లు గాఁజుట్టి
గూనువోనడి వీపుఁ గొట్టి కొట్టి,

గీ. ఇట్లు బాధించి శోధించి యెందు నొక్క-
వచ్చపైకంబు గానక వ్వచ్చి బోయ
నేఁటి తెఱవాటు పసలేక దాఁటిపోయె
ననుచు వెసవారి పిసమాని యవలి కేఁగె. 44.

గీ. వింటికొప్పునఁ జేయూఁది విన్నబోయి
యుసురుసురటంచుఁ గలఁగుచు నున్నవాని
చందమీక్షించి యప్పుడా శాంతమతులు
మునులు పలికిరి చేసాఁచి మనికితమున. 45.

గీ. తాపసుల మమ్ముఁ బసుల చందమునఁ గొట్టఁ
జేతులెట్లాడె నిది యేమి చేటు నీకుఁ!
బాతకుఁడు గాఁగ నెన్నాళ్ళు బ్రతికెదీవు?
రాతఁ జేసిరె యోరికిరాత! నిన్ను. 46.

క. ఇటు మునుపు నీవు చేసిన
వటుసాహసమునకు నెల్ల ఫలమగునోయీ!
జటివరుల నిటులఁ గొట్టితి?
కటకట! యిఁకనైన దురితగతి మానవుగా! 47.

క. ప్రాయము జలకల్లోల
ప్రాయము, కాయంబు నస్థిరం, బిందులకై
రోయక దురితమె తపమని
పాయక చేసెదవు నిందపరఁగఁ బుళిందా! 48.

వ. అనిన నా లుబ్ధకుండతి శుద్ధస్వభావుల సల్లాపయోగంబున నుల్లంబునం
గొంత శాంతి పల్లవింప వారల కిట్లనియె. 49.

ఆ.వే. బేల తపసులార! యాలిబిడ్డలకుఁగాఁ
గాఁక నావటించఁ గాన విడిసి
విల్లు నంపకోల లెల్లనుఁ గైకొని
యున్న నాకుఁ బాపమొదవు టెట్లు? 50.

వ. అనిన నత్తాపసాగ్రణులెట్లైన వీని ననుగ్రహింప వలయునని మఱియు
నిట్లనిరి. 51.

క. ఓరోరి ! నీవు చేసిన
ఘోరపుఁ బాపములు నీవు గొడుకులు నాలుం
జేరఁబడి పంచుకొందురో ?
వారికిఁ బనిలేక నీక వచ్చునో ? చెప్పుమా ! 52.

క, అన విని వారి ముఖాలో
కనమున జ్ఞానంబు పొడమఁగా శబరుండో
మునులార ! యిత్తె అంగా
లిని బిడ్డల గొబ్బునం దెలిసి యేవత్తున్. 53.

క. అదెపల్లె దవ్వు లేదిటు
కదలకుఁడే వచ్చెదనుకఁ, గాదని యవలం
గదలిన నాలావు నెఱుం
గుదురే కద ! యంచుఁ బలికిఁ గొబ్బునఁ జనియెన్. 54.

మ. చని మార్గంబున నేణవర్గముల నేచంబోక, లక్షించి ప
క్షిని కాయంబును గొట్టఁ గోరక మదిం జింతాభరం బెంతయున్
ఘనమై యెక్కఁగఁ బక్కణంబునకు వేగం బోయి యా చక్కఁజ
క్కని తాటింటికి నేఁగి వ్రేఁకమగు కాఁకన్ వెచ్చగా నూర్చుచున్. 55.

క. విలునమ్ములు నటువైచుచు
నలసత నొక జింకతోలు నందునఁ గూర్చుం
డిల వ్రాయుచుఁ దనపాపముఁ
దలపోయుచు నెమ్మనమునఁ దల్లడపడుచున్. 56.

వ. తనయంగనం గనుంగొని యక్కిరాతుండు. 57.

క. ఓ పడఁతి ! నేనొనర్చిన
పాపంబులు దలఁప నీకుఁ బనిగలదో ? నా

కే పనియొ? కాక చెఱిసగ
మై పరగునొ? నాకు దాఁచ కంతయుఁ జెపుమా! 58.

క. అనవిని నెచ్చెలి నగుచు
న్వీను నాయక! తలఁపనాకు నీదగు పావం
బునకుఁ బనిలేదు నీ ప్రో
పున నెంతయుఁ గుడిచి కట్టి పొసఁగుటకన్నన్. 59.

చ. తవులగు వారికెవ్వరి కతంబున నీ వెరవప్పు దీసి తె
త్తువా? కొని తెత్తువో? తెరువు దోఁచుచు తెత్తువా? జూదమాడి తె
త్తువా? చని తెత్తువో? యదియు దోసమొ? పున్నెమొ? నాకునేఁటికా
రవరవ నీవు దెచ్చినవి డాఁచక వండఁగఁ బాడి నిచ్చలున్. 60.

క. అన విని మనస్సు చివుకురు
మనఁ, గొడుకుల బిలిచి యట్ల యడిగిన వారుం
జనని పలికినటు పలికిన
విని యచ్చెరువొంది చాల వెడవెడ నగుచున్. 61.

మానసిక పరివర్తనము వలన కిరాతుఁడు తపస్సునకుఁ బోవుట.

గీ. మోసపోయితి నిన్నాళ్లు నాసఁ దగిలి
యాలు బిడ్డలుఁ దానుఁ జుట్టాలనంగ,
నెవ్వరెవ్వార? లే యూరి కేదిత్రోవ?
వీరికేఁ బాటు పడుటెల్ల వృథయ యనుచు. 62.

క. దోసమునకుఁ బనిలేదఁట!
నాసొమ్ములు వీరికిం దినం బని గలదే!
రోసితి సంసారముఁ దెగఁ
గోసితి మొదలంట బందుగుల తగులెల్లన్. 63.

వ. అని తలంచి యన్నిషాదుండు సన్న్యస్త సమస్త సంసారుఁ డగుచు,
నానాసుకృతవాసనా విలసితంబగు ననూన జ్ఞానామృతాపాద

సంబున మోదంబు నొందుచుఁ బుత్త్ర మిత్త్ర కళత్త్రాది సంగమంబుఁ దొలంగి, కర్మిష్మల నమ్మునుల పాలికిం జని యందంద వందనంబులు గావించి, అంజలిపుటఘటితనిటలతటుండగుచుఁ దచ్చరణ రేణు సంస్పర్శనంబునం బాటిల్లు వాక్పాటవంబున నో మునీంద్రులారా! సకలకలి కల్మషనంబగు మీ సందర్శనంబునం గృతార్థుండనైతి, నా జననంబు సఫలంబయ్యె, నాజవంజవ భంజన స్వతంత్త్రంబగు నొక్క మంత్త్రంబు నా కుపదేశింపుఁడనుచు సంతసంబునం బునః పునః ప్రణామంబు లాచరించిన నవ్వాచంయములు వ్వనేచరుని సమీచీన ధీ చాతుర్యంబునకు నాశ్చర్యంబు నొందుచు, మున్ను వీఁ డెన్ని తపంబులు సలిపెనో! యాటవికుండయ్యు సత్కర్మ వాటింపందలంచె, నెంతటి ధన్యుండని సంతసించి, సర్వవర్ణసాధారణంబును, నిఖిల మంత్త్ర ఫలదంబును, లోకాపార దోషరహితంబును, దేశకాల నియమానుపేతంబును, సత్యాకామంబును, శ్రుత్యభిరామంబును మనుసార్వభౌమంబును నగు రామనామంబుగాని వీనిం బవిత్త్రుం జేయు వేఱొక యుపాయంబు లేదనియు నేతాదృశులకుఁ బ్రతిలోమంబుగా నుపదేశింప వలయునని విచారించి యాదండ నొక్క తీర్థ కుండంబున నక్కిరాతు సుస్నాతుఁ గావించి సంభావించి, 64.

పంచచామరము :—

కిరాత! రాఁ దలంపు మాత్తి కేవలంబు భక్తిమై
'మరా, మరా' యటంచుఁ బల్కు మా యనుగ్రహంబునన్
బరాకు రాదటంచు రామ మంత్త్రమిచ్చి యంతటన్
ధరాధరాధి భూవిభూతి దర్శనాభిలాషులై 65.

క. చనిరవ్వల నమ్మునులును,
వనచరుఁడును వారిబుద్ధి వదలక మదిలో
ననుదినము కందమూలా
శన మొనరించుచును నితర సంగ రహితుఁడై. 66.

సీ. నుదుటఁ జేగురుఁబొట్టు పదనింకగాదని
తులసిమృత్తిక నూర్ధ్వతిలక మిడియె,
సెలసువిల్లువహించు కెలసంబుగాదని
వేణుకుండిక యొండు పాణిఁబూనె,
సొగను నున్నని కోర సిగ నూటిగాదని
నిడుదపెన్నెఱులెల్ల జడనుదాల్చె,
నిండుగాటపు నీలి దిండు గాదని కటిఁ
బలుచని నారచీరలు ధరించె,

గీ. దినము తమసాతరంగిణీ తీర్థమునను
స్నానమొనరించి యత్యంత శాంతిమెఱయ
మానులుపదేశ మిచ్చిన మంత్రమెపుడుఁ
దపము సేయుచు నక్కిరాత ప్రభుండు. 67.

క. ఈ సరణివాఁడు సకల
వ్యాసంగముమాని మాని వర్తననుండన్
వేసటచే వీఁడెక్కడఁ
గాసిం బడెననుచు వాని కలవారెల్లన్. 68.

బంధువులు తపోభంగము చేయుటకు ప్రబోధించుట.

క. చెట్టుల పట్టుల గట్టుల
చుట్టుల నందంద వెదకి సొలయుచు నొకచో
నట్టడవిలోనఁ గదలక
చట్టుంబలె నున్నవాని చందముఁ గనుచున్. 69.

క. నట్టడవిఁ జట్టుకొడుకై
కట్టెదుటన్ మనము నిలువఁగాఁ జూడఁడు తా
నిట్టెట్టు, బాపనదయ్యము
పట్టెనొ? యీరావినుండి శాపురె! వీనిన్. 70.

క. ఇయ్యడవి వీనినే బలు
దయ్యంబులు వ్రేసెనొక్కొ? తరలక యుండన్
దయ్యఁ డొకింతయు మనతోఁ
గుయ్యాన నొల్లండు కన్నుఁ గొన తెఱవంగన్. 71.

సీ. నెమ్మిపించపుదండ గ్రిమ్మచుట్టెడు కొప్పు
జడలుదాల్చుట కిట్లు గడులు కొనెనె?
పచ్చికస్తురిబొట్టు పసమీఱు నెన్నొసల్
సుద్ద రేకల చుక్క దిద్దఁబడెనె?
తడవిల్లొకప్పుడు విడువని చేతుల
మోము చూపెడునట్టి ముట్టుగనెనె?
యడవిలోఁ గడువడి యుడుగని యడుగులు
గదలక యీచాయఁ గుదురుకొనెనె?

గీ. యకట! చెడి వీని నెవ్వఁడో యంకకాఁడు
తప్పుసుద్దుల బుద్ధులు తగులుకొలిపి
బోయజాతికి వెలిగాఁగఁ బాయఁజేసి
నాలుబిడ్డల మనుమల నలియఁజేసె. 72.

వ. అని వానింజేరుకొని యందఱు మఱియు నిట్లనిరి. 73.

ఉ. దాయలు గూడి యెవ్వరు పితా! నిను మాతలఁగాక యుండని
మ్మాయలు పన్నిరింత చలమా! తలమానిసి వింటవింట నీ
వేయఁగనేరవో? మలల నేయెడలం దిరుగాడ నేరవో?
బోయతనంబు వీఱేఁడిన పోయెఁగదా మగవాసి వమ్ముఁగన్. 74.

క. సాముదిగవిడిచి యొడలిటు
సాముగ నట్టడవి నిదురసవిమాని యయో!
జాము దిగఁ గాళ్ళు నెనిమిది
జాములు నిటులుండమనదు జాతికిఁ దగునే? 75.

సీ. కన్నులు దెఱవని గండభేరుండంపు
నిసువుల నెవ్వారు నేర్తురరయ?
ఏనుంగు తలపోల నెవ్వారు దెత్తురు
పెంచిన సింగంపుఁ బిల్లలకును?
కవిసిన దొడ్డిలోఁ గాఱెను పెంటుల
దట్టించి యెవ్వారు గట్టఁగలరు?
పులుల కూనలకు ఱేపును మాపుఁ దగునట్టి
మేపులెవ్వారు దెచ్చి మేపఁగలరు?

గీ. ఇంట నీవటులేకున్న నిట్టిపనులు
కుఱుచ బుడతలచే నౌనె? కొలమువారు
చాల నెగ్గింప నామము చాతినుదుట,
నుదుటుతన మెల్ల మాని యిట్లుండఁ దగునె? 76.

ఉ. కానకు నేఁగి వింతరుచిఁ గల్గినపిట్టలుఁ, జెట్టు జున్నులున్,
దేనెలు, చాఱపప్పులును దెచ్చెగదా యికనంచు గూళ్ళలోఁ
గూనలువోని నీకొడుకుఁ గుఱ్ఱలు నీ చనుదెంచుత్రోవ చూ
పానఁగ నిల్తురయ్యెడలు హా! మముబోంట్లకుఁ జూడవచ్చునే? 77.

క. గువ్వకఱకుట్లు, మొకముల
కొర్వ్వల బొరుగులును గుముకు గుముకులేయుటయున్
నివ్వరికూడును నింటం
బువ్వంబునఁ గుడువకిట్లు పొక్కందగువే? 78.

ఉ. బోయమిటారి కత్తియలు పున్నమవెన్నెల బైట నీపయిం
బాయని బాళి కిన్నరలు మాటికి మీటుచు నీ ప్రతాపమున్
హాయని చొక్కి పాడ వినవా? కనవా? మనవారిఁబాసి నీ
వీయెడ నొంటినుండఁ దగవే? తగవే? చనుదెమ్మ వీటికిన్. 79.

సీ. దుప్పులఁ బడనేసి యుప్పుఁగండలు చేసి
చప్పరింపుచునుండుఁ జవులుమఱచి,

మదహస్తినడలించి తుది హత్తిరాఁ బొంచి
యెదఁనాటు కొనసేయు నేటుఁదుడిచి,
పచ్చికస్తురిమేన హెచ్చి వాసనలీన
రంగులేయుచునుండు రహిఁదొలంచి,
మింటిమ్రాఁకులనంటి నంటి మ్రాఁకులువ్రాకి
జుంటి తేనెలుగ్రోలు సొంపుమాని,

గీ. నారచీరలుగట్టి యన్నంబుదట్టి
గాలిమెసవుచు నాతిపై బాళిలేక
జపము వ్రేళ్ళను నెన్నుచు జాతివిడిచి
బాపలనుఁగూడి యుండుట బ్రాఁతియగునె? 80.

గీ. తెల్లవారిన గుండగ్గి కోళ్ళలీల
నీళ్ళమునుఁగుచు నొడలెల్లఁ దెల్లఁబాఱ
నిట్టిపాసంబులను గూడి నెవ్వఁడొడరు
వెడఁగుబాపన తగులునఁ బడితివేల? 81.

క. పతిచెడ్డ బీద బాపని
గతినిట్లుండంగఁ దగునె? కటకటమదినీ
వెత నెంచవు మనకులమగు
మతమెంచవొకింత, రాత మలిచిరొనిన్నున్. 82.

వ. అని యివ్విధంబున నా వ్యాధులెల్ల మహావ్యాధులంబోలె బాధింపఁ
జయ్యన నసాధారణాగాధ బోధైక నిధానుండగు శబరనాధుండును.83.

## కిరాతుని తపోనిష్ఠ

క. కనుఁదెఱచి నవ్వి యేమియుఁ
బనిలేదని ముందు మీరు పలికితిరిపుడే
పనికిటు వచ్చితి రిందఱుఁ
జనుఁ డెఱుఁగుదు మీదు మాయ జరగునె? యింకన్. 84.

గీ. తండ్రి రాముఁడు, జనకజ తల్లి, యెల్ల
బంధులును నాకు నాస్వామి భక్తులెన్న,
నింతవాఁడను నాకిందు నెదురు గలదె?
సకల జగముల నేలుదు సుకరముగను. 85.

క. మీరెవ్వరు? మేమెవ్వరు?
నేరము లెంచక చనుండు నిలువక యెటకే;
శ్రీరఘుపతియే నాకు న
కారణ బంధుండు, గురుఁడు గణుతింపంగన్. 86.

క. కట కట! జననంబులు వే
అఁట! గుణకర్మాదికంబు లఖిలంబులు వే
అఁట! చనియెడుత్రోవలు వే
అఁట! యిది యట మఱెపుఁ గూటమని కనవలదా? 87.

క. సతులెవ్వరు? సుతులెవ్వరు?
హితులెవ్వాఁ, రేటివఱద నెందే నొకచో
జతఁగూడిన కాష్ఠంబుల
గతినించుక కూడి విచ్చికదలుదు రవలన్. 88.

క. అనియాశ విఱుఁగనాడిన
విని యందఱుఁ జనిరి ఱాత వేసినగతి, న
వ్వనచరుఁడు నంత నంత
ర్ఘనతర బోధావధాన రంజితుఁడగుచున్. 89.

సీ. సరసిజాకరముల నరసి పద్మాక్షముల్
పరిపక్వముగ నేఱుపఱచి తెచ్చి,
పురుషయోగ్యములైన పూసలుపరికించి
ముఖములు ముఖములు మొనయఁజేసి,

వర భాగములతో నపరభాగములనుంచి
నడుమ మేరువుగ రెండిడియమర్చి,
యంతరంబున గ్రంథులమరసూత్రంబున
నూటయెన్మిదియుఁ బొందువడఁగ్రుచ్చి,

గీ. యట్టి యక్షసరంబుఁ జేపట్టి తనకు
మానులిచ్చిన యదిగాక మానసమునఁ
దలఁచి యంగుష్ఠికాద్యంగుళులను మేరు
పదము దాఁటక త్రిప్పి జపంబుచేసె. 90.

సీ. దినము 'మరామరా' యనిపల్క నంతంత
యది 'రామరామ' పర్యాయమయ్యె,
నా రామనామ జపానుభావంబున
నంతర్ముఖతఁ జూడ నల్లనల్ల
నల్లని మొగులొండు నానాఁటఁ గనుపించె
నదియుఁ గోదండ కాండాంకితమగు
సగుణ భావముఁజెందె, సగుణరూపంబెల్ల
రూపింప నిర్గుణ రూపమగుచుఁ

గీ. గోటి రవిచంద్ర తేజమై కొమరుమిగిలి
నట్టి తేజంబు నందును నంతరంగ
మిట్టటు చలింపనీయక గట్టిగాఁగ
బూదెఁ గఱగిన గతినేకముగ ఘటించె. 91.

క. అత్తేజంబున నెంతయుఁ
జిత్తమలయ నంతఁగాయ సిద్ధిమెఱయఁగా
హృత్తామరసమె నూచుచు
నుత్తమ యోగులు నుతింపనుండె నచలుఁడై. 92.

# కృష్ణపక్షము.

## (i) అన్వేషణము

— శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి.

"తలిరాకు జొంపముల సం
దుల తోఁవల నేలవాలు తుహినకిరణ కో
మల రేఖవో! పువు దీవవో!
వెలఁదీ! యెవ్వతెవు నీపవిటపీవనిలోన్ ? 1.

కారుమొయిల్లు కాటుక పొగల్ వెలిగ్రక్కుచు తమాలవాటి నే
దారియుఁ గానరాదు, నెలతా! యెటువోయెద వర్ధరాత్రి? వి
స్ఫార విలోచనాంధతమసమ్ములఁ జిమ్ముచు, వేడివేడి ని
ట్టూరుపులన్ నిశీథ పవనోర్మి వితానము మేలుకొల్పుచున్". 2,

"అది శరద్రాత్రి; శీత చంద్రాతపాంత
రాళ రమణీయ రజత తల్పంబు నందుఁ
జల్లఁగా నిద్రవోవు వ్రేపల్లెవాడ
సకల గోపాల గోపికా జనముతోడ. 3.

సామి సడలిన పతిపరిష్వంగమందు
సుఖము దుఃఖములేని సుషుప్తిలోన
స్వప్నవీథీ యథేష్ట సంచార కలన
మేనుమఱచిన నన్నంత మేలుకొలిపె. 4.

శర్వరీ శీతపవన పక్షముల మలసి
స్వాదుయమునోర్మి సంగీత ఝురులఁగలసి

కౌముదీ ధౌత శుభ్రదిక్తటుల సొలసి
మురళికామంద మంవమాధురుల రుచులు. 5.

ఎలఁదేఁటి చిఱుపాట సెలయేటి కెరటాలఁ
బడిపోవు విరికన్నె వలపువోలె
తీయని మల్లెపూఁదేనె సోనలపైని
తూగాడు తలిరాకు దోనెవోలె
తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలోఁ బయనమై
పరువెత్తు కోయిల పాటవోలె
వెల్లువలై పారు వెలఁది వెన్నెలలోన
మునిఁగిపోయిన మబ్బు తునుకవోలె

చిఱుత తొలకరి వానగాఁ, జిన్ని సోనగఁ,
బొంగి పొరలెడు కాల్వగా, నింగి కెగయు
కడలిగాఁ బిల్లగ్రోవిని వెడలు వింత
తీయఁదనముల లీనమై పోయె నెడఁద. 6.

పరువు పరువునఁ బోవు నెదతో
పరువులెత్తితి మఱచి మేనే
మఱచి సర్వము నన్ను నేనే
మఱచి నడిరేయిన్ !" 7.

"ప్రాణ నాయకు కౌఁగిలి పట్టు వదలి,
యిల్లు వదలి, యెన్నండు నీ పల్లె వదలి
యడు గిడని దాన నానాఁటి యర్ధరాత్రి
విజన పథములఁబడి యెట్లు వదలినావు?" 8.

"తావులతోడఁ దేనియల ధారలఁ జిప్పిలు వేణు గీతికా
రావముతోడ మందగతులన్ జను మారుతముల్ విశాల బృం
దావన వీథులందు యమునా నవభంగ మృదంగ వాద్యముల్
త్రోవ స్ఫురింపఁగా వలపు తొందరవెట్టఁగఁ బోతి నొంటిమై. 9.

సన్నని యెల్గెత్తి జాలిగా నెవరినో
యరయుమా! పిలుచుచున్నదియె యమున!

ప్రిక్క నిర్జీవ ధావళ్యమ్ముతో నున్న
సికతాతలమ్ము గాంచితివె దాని ?
తుదిమొకల్ లేదిదే త్రోవరుల్ తొక్కని
యీదారినే పరువెత్తినాను !
ఈ మొండిచేతుల నెత్తి యీ వనతరుల్
శూన్యదృక్కుల దిశల్ చూచునయ్యొ !
ఇచటనే-యిచటనే-యతఁ-డిచట నేను -
ఇచట నీ జాజి పూఁబొదరింట నేను -
ఈ కడిమిచెట్టు క్రింద సుమ్మా యతండు -
సరిగఁ గన్నులఁ గట్టిన సరణిఁ దోఁచు. 10.

శారద శర్వరీ మధుర చంద్రిక, సూర్యసుతా స్రవంతికా
చారు వినీల వీచిక, ప్రశాంత నిశాపవనోర్మి మాలికా
చారిత నీపశాఖిక, కృశాంగిని గోపిక నేను నాఁడు బృం
దారమణీయ సీమ వినినారము మోహన వేణుగానమున్. 11.

మలయ పవను కౌఁగిలిలోనె పులకరించి
హాయిగాఁ గంఠమెత్తు ప్రియంపు వంశి
విశ్వమోహను జిలిబిలి పెదవులంటి
యవశమై పోయి యేమి చేయంగ లేదు ! 12.

బాలగోపాలుఁ బోలెడు పాటగానిఁ
గనివిని యెఱుంగ మెన్నండు; కరములోని
మురళినే కాదు, నాలోని మోడువెడఁద,
నీ శిథిల జీవనమ్ము మ్రోయింపఁ గలఁడు. 13.

నందగోపకుమారు నానంద మురళి
కామనోహర సుషిరావగా తరంగ
జాలములఁ దారకారవి చంద్రతతులు
కరఁగి చిని చిన్నిగీతులై కలిసిపోవు. 14.

చూచితిరొ లేదొ చిన్ని కృష్ణుని సొబంగు ?
పెదవి చివురు సంజల నరవిచ్చు నవ్వు

వెన్నెల, చలించు దుమ్మెద బెళుకు చూపు,
లోల పవనచాలిత కుటిలాలకమ్ము. 15.

తరళ చూడాకలాపమ్ము, మురళిఁ గూడి
యల్లనల్లన గొంతెత్తి యమృతగాన
శీతల తుషారముల విరజిమ్ము వేళఁ
జిన్ని కృష్ణుని సొబఁగుఁ జూచితివో లేదొ? 16.

లేవు శరత్తమస్వినులు, లేవు మనోజ్ఞ సుధాంశు మాలికల్,
లేవు వినీల నిర్మల కళిందసుతా నవనాట్య సంపదల్,
లేవు మదీయ గాత్రలవలింబులకాంకుర కోరకావళుల్,
లేవు కుమార గోప మురళీ మృదుగీత ఝరీ విలాసముల్! 17.

జిలిబిలి పట్టు తేకుల వెన్కఁ దొట్రిలు
మల్లియ యెద దాగు మధుపరవము,
కనుచూపు దాటివామనిఁ బాయు కోయిల
గొంతులోఁ జిక్కు వసంత గీతి,
విభువీడి శుష్కించు విరహిణి సెలయేటి
కడుపులో నడఁగిన కడలి మ్రోఁత,
తేనికై వెదకెడు తిక్క చూపులలోనఁ
జెరవడ్డ నిండు చందిరుని పాట,

యిట్లు నీదీన గోపికా హృదయ మంది
రాంతరాళములోనఁ దుర్లింత లాడు
వేణునాదంబు, విడిపింపు విశ్వమోహ
నాకృతిఁ గిశోరగాయకు నరయుచుంటి. 18.

ఇది నాచరితము విని నీ
వదరెదు, తొట్రిలెదు, వడఁకు, దటునిటు కనులన్
జెదరెడు చూపుల నేదో
వెదకెదు! ఎవ్వాతెవు నీపవిటపీవనిలోన్?" 19.

---

# ii తేఁటి వలపు

మలయ సమీర ణోర్మికల మాలికలం బ్రణయార్ద్ర గీతికల్
మలయుచు నాట్యమాడవు సుమప్రమదామణి పుల్కరింపనో
యళివర, తేనె లానవు వనాంతర మంతయుఁ జిన్నవోయెఁ గో
మల జలజాత పత్రముల మాటున నేటికి డాగినాఁడవో! 1.

అలరుఁ బడంతు లెల్లరు హిమాంబువులన్ నవ మల్లికా సతిన్
జలకము లార్చినారు, వనజాత పరాగ మలందినారు, మేల్
జిలుఁగు హొరంగు పొందళుకుఁ జీరలఁ గట్టిరి పెండ్లి కంచుఁగో
మల జలజాత పత్రముల మాటున నేటికి డాగి నాఁడవో! 2.

అలరుచు మల్లికా పరిణయం బని వచ్చిరి పూవుబోంట్లు, కో
యిల సవరించె గొంతు, తమ యేలికకై విరిదేనె పానకం
బళితతి గూర్చెఁ, బుప్పొడుల నత్తరులం బవనుండు చేర్చెఁ, గో
మల జలజాత పత్రముల మాటున నేటికి డాగి నాఁడవో! 3.

వలపు హరించి నాఁడ వఁట, స్వాదు మరందముఁ గ్రోలితంట, మైఁ
బులకలు పుట్టగా మధుర మోహన గానముఁ జేసితంట, మా
లలన యమాయకాత్మ భ్రమరా, తగునా వగవాడఁ జేయఁ గో
మల జలజాత పత్రముల మాటున నేటికి డాగినాఁడవో! 4.

వలపులు గ్రుమ్మరింపదు, నవ ప్రణయోదయ హాస చంద్రికల్
చిలుకదు, తోడి చిన్ని విరిచేడెలతో జతఁగూడి నాట్యముల్
సలుపదు, మంచు ముత్యములు పట్టద, తాల్పదు మల్లికాంబ కో
మల జలజాత పత్రముల మాటున నేటికి డాగినాఁడవో! 5.

జల జల రాల్చు దుర్భర విషాదమునం దుహినాశ్రు బిందువుల్,
వెల వెలఁ బోవు మారుతము వీచినఁ బాదప పత్రసంతతిన్
తలిరులు విన్నఁ బోయి యెదో తప్పొనరించిన రీతి నక్కఁ గో
మల జలజాత పత్రముల మాటున నేటికి డాగినాఁడవో! 6.

లలిత మనోజ్ఞమూర్తి యళిరాజు మనోహర గాన సత్కళా
విలసితుఁ డార్ద్రచిత్తుఁడని వేల వరించెను నిన్ను మాలికా
లలన యెఱుంగ దింత యనురాగము తేనెలతేట కంచుఁ గో
మల జలజాత పత్త్రముల మాటున నేటికి డాగినాఁడవో ! 7.

తేనెలం గూర్చి, వలపులఁ దేటపఱచి,
ధన్యురా లయ్యె మాచెలి తలిరుబోఁణి !
కాని నిరతంబు మల్లిక కడనె యుండి
ముదముఁ గూర్పగ మాకొక్క పూవెచెప్పుమ ! 8.

---

## iii స్వేచ్ఛాగానము

౧

తిమిరలత తారకా కుసుమములఁ దాల్పఁ
గర్కశ శిలయు నవజీవకళలఁ దేఱ
మ్రోడు మ్రోక చివురులెత్తి మురువు సూప
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు. 1.

క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదిరి పోవ
గగనతలము మార్మ్రోఁగఁగఁ గంఠ మెత్తి
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు. 2.

చిత్త మానందమయ మరీచికలసోల
హృదయ మానందభంగ మాలికలఁ దేల
కనుల నానంద జనితాశ్రుకణము లూర
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు. 3.

యుగయుగంబుల నీశ్వర యోధు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించువారి
యమల జీవిత ఫలము ధన్యతను గాంచ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు. 4.

భయముఁ గలిగించు కష్టాతపంబు మఱచి
కరము కలఁగించు వంత చీఁకట్లు మఱచి
విశ్వమే పరవశమయి వెంటఁ బాడ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు. 5.

# స్వేచ్ఛాగానము

౨

నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు ?
నాయిచ్ఛయేగాక నాకేటివెఱపు ?
కలవిహంగమ పక్షములఁ దేలియాడి
తారకామణులలోఁ దారనై మెఱసి
మాయమయ్యెదను నామధుర గానమున !
నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు ? 1.

మొయిలు దోనెలలోనఁ బయనంబొనర్చి
మిన్నెల్ల విహరించి మెఱుపునై మెఱసి
పాడుచుఁ జిన్కునై పడిపోదు నిలకు,
నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు ? 2.

తెలిమబ్బు తెరచాటు చెలిచందమామ
జతఁగూడి దోబూచి సరసాలనాడి
దిగిరాను దిగిరాను దివినుండి భువికి.
నవ్విపోదురు గాక నాకేటి సిగ్గు ? 3.

శీకరంబులతోడ జిఱుమీలతోడ
నవమౌక్తికములతో నాట్యమ్ము లాడి
జలధి గర్భమ్ము లోపల మున్గిపోదు.
నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు ? 4.

పరువెత్తి పరువెత్తి పవనుని తోడఁ
దరుశాఖఁ దూఁటి పత్రములను జేరి
ప్రణయ రహస్యాలు పల్కుచునుందు.
నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు ? 5.

అలరు పడంతిఁ జక్కిలిగింత వెట్టి
విరిచేడె పులకింప సరసను బాడి
మఱియొక్క వనతోడ మంతనంబాడి
వేఱొక్క సుమకాంత వ్రీడఁ బోఁగొట్టి
క్రొందేనె సోనలఁ గ్రోలి సోలుటకుఁ
బూవుపూవునకును బోవుచునుండు.
నవ్విపోదురుగాక నాకేటిసిగ్గు ?

పక్షి నయ్యెదఁ, జిన్ని ఋతుమయ్యెదను,
మధుప మయ్యెదఁ, జందమామ నయ్యెదను,
మేఘ మయ్యెద వింత మెఱపు నయ్యెదను
అలరు నయ్యెదఁ, జిగురాకు నయ్యెదను,
పాటనయ్యెదఁ, గొండవాగు నయ్యెదను,
పవన మయ్యెద, వార్ధి భంగ మయ్యెదను,
ఏలకో యెప్పుడో యెటులనో గాని
మాయమయ్యెద నేను మాఱిపోయెదను.
నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు
నాయిచ్ఛయే గాక నాకేటి సిగ్గు ?

# ఉపదేశము.

## శ్రీ శివభారతము ( తృతీయాశ్వాసము )

— శ్రీ గడియారము వేంకటశాస్త్రిగారు.

మ. శివరాజీగతిఁ గొంకణక్షితి జయశ్రీ నొంది తత్పాలన
వ్యవహారంబులు దీర్పఁగా బనిచి సేవాకాంక్షియై రామదా
సు విలోకింపఁగ నెంచి వారియునికిన్ జూపెట్టఁగా నాత్మ భృ
త్య వితానంబును బంచి యొక్కతఱి వేఁటాడన్ మదిన్ గోరుచున్.

ఉ. సేవలతోడ సహ్యవనసీమలఁ జొచ్చి దురంత జంతు సం
తానముఁ ద్రుంచునప్పుడట దాపునఁ దీవల యాకులందు ముక్తా
నిచయంబుఁ గూర్చినవిధంబగు నిద్దపువ్రాలఁ జూచి య
వ్వానిఁ బఠించె నీగతి శివప్రభుఁ డుత్సుకితాంతరంగుఁడై. 2.

తే. అదరువోయిన హైందవ హృదయములకు
జీవ బలములఁ బోసి ప్రాచీన ధర్మ
పాలనము సేయ నినుగోరి, భరతభూమి
వేచియున్నది శివపతీ! వెడలుమింక. 3.

తే. తుళ్ళు కెరటాల నురుఁగు కరుళ్ళు దేల
"భోరు"మను మ్రోఁతఁజగ మెల్లఁ బుక్కిలింప
దాఁటు కడలి తుఫానులో "ధర్మనౌక"
సుడియుచున్నది, దరిఁజేర్ప నడువుమింక. 4.

తే. చెదరి పోయిన యంగముల్ కుదురు పఱచి
సడలు వారిన తంతువుల్ చక్కఁదీర్చి
యనుగతి శ్రుతి భువన మోహనము గాఁగఁ
హాయిఁ బలికింప లెమ్ము జాతీయవీణ. 5.

తే. గీ. దేవముని ధేను విప్ర సాధ్వీ పదాబ్జ
పావన పరాగ పరిపూత భరతభూమి
కలిపురుష దుర్విహార కశ్మలముగాఁగఁ
జూడఁజాలక శివపతీ! చూతునిన్ను. 6.

సీ. అసురబల పరాహత మూర్ఛితాత్మీయ
చేతనాధర్మ సంజీవకరణి,
పరమతాశుగ శల్యపాతోపతాపిత
స్వమతాపవేధ విశల్య కరణి,
భగ్నావయవ సంధిబంధ స్వజాతీయ తా
యథాకరణ సంధాన కరణి,
యినకులాపాయ దుర్దినతాంత సుభట జీ
వన నవోత్సాహ సౌవర్ణ కరణి,
తే. అయిన క్షతాన్వ యౌషధీ శాంకురంబు
నంచిత తదాప్తి సహ్యాశైలాంతరమున
నరయుచున్నాఁడు సుమి! సుమిత్రాపచార
పరిహృతి పరాయణుఁడు రామభక్తుఁ డిపుడు. 7.

చ. అనియెడు పద్యపఙ్క్తి హృదయంగమమై విశదాక్షరంబులై
కనుపడఁ బల్మఱున్ జదివి గాఢ నిగూఢ తదీయ భావ భా
వనమున మేనుపొంగ గరుపాటిన డెంద మమంద విస్మయ
ధ్వనితము గాఁగ నచ్చటి విధమ్మునకున్ దలయూఁచె నీగతిన్. 8.

చ. "ఇది పరమాద్భుతంబు పరమేశని దేశము, సహ్యాపర్వతం
బిది చిగిరించె నేమొ యిపుడీగతి నెందును దేశభక్తి, సా
భ్యుదయ మతప్రసక్తి, సమయోచిత ధర్మపథానురక్తి, యు
చ్చదశకుఁ బోవు హైందవము సర్వము నేఁడిటు మేలుకొన్నదో. 9.

ఉ. కాదిది తాను దామొలిచి కన్పడు భౌతిక సృష్టి, యోగవి
ద్యాదయితుం డొకానొక మహాపురుషుం డొనరించు శాంబరీ

వాదము; రామదాస మునివర్యుల పాదుకలంటుగొన్న యీ
మేదిని నిర్వహింపదె యమేయము లిట్టివి పెక్కు చిత్రముల్! 10.

ఉ. ఎన్నిదినంబులయ్యె గనులెత్తి గురూత్తము దర్శనమ్ముకై
జన్నియవట్టి! యీ యపుగు జాడలు నేటికిఁ జిక్కవయ్యె; నా
వెన్నునఁ జేయిదట్టి నడిపించెడు దైవముఁ జూడ వీపునన్
గన్నులు నాకుఁ దోఁచవలెఁ, గాకతఁడే యెదురైనఁ గావలెన్. 11.

ఉ. పౌరుషమెందు దైవబల పక్వము, దైవము సాధు సజ్జనా
కారము, సాధుపుంగవుఁ డకారణ బంధువు రామదాసుఁడే
భారత భావి భాగ్యరమ పట్టయి నన్నడిపించుచుండ నా
ధోరణ ధూత గంధగజ ధోరణి నింకఁ బరాక్రమించెదన్. 12.

చ. ఒక పరమాణువుం బొదివి యూర్జిత సృష్టిక్రమన్వయంబుఁ గొం
కక యొనరించు పండితునిఁ గానక నాకొక రూపునిల్చునే?
యిఁక సకలంబు నా కడఁక యేకముఖం బొనరించి, నాదు దే
శికుఁ గనుదాఁక నిట్లుపవసింతుఁ జుమీ, హఠయోగ జీవికన్!" 13.

చ. అని తలపోయుచున్ శివమహాప్రభుఁ డవ్వనసీమ నందు నం
దును వెదకెన్ భటవ్రజము తోడుగ సాధు సమర్థ రామదా
సుని మునివర్యు, నిట్లలఁతఁ జూపక చెట్టును గుట్ట లోయలున్
గనుమలు నెత్తముల్ గుహలుగా వెదఁగ్రుమ్మరుచుండ నొక్కచోన్.

మ. దళసంతాన వితాన శీతల వటాధచ్ఛాయఁ గుంజోదర
స్థలి దర్భాస్తరణస్థుఁడై గఱిక పోచల్ రెండు మూఁడంది పా
త్రిలి సెజ్జన్ బొరలాడు లేడి సిసుఁగుర్ దిన్పించుచున్, దానిచేఁ
తల కప్పొంగెడు రామదాసు భవబంధగ్రాసు నీక్షించుచున్. 15.

ఉ. కన్నులఁ దొంగిలించు కుతుకంబున మోము దుఱుంగలింపఁ, బై
కొన్న సముత్సుకత్వమునకున్ గుఱియై మది చెంగలింప, న
భ్యున్నత పాణులెత్తి శిరమున్ గదియన్గొని దోయిలించి, "సం
విన్నిధయే నమోస్తు గురవే!" యని తత్పదపీఠి వ్రాలినన్. 16,

చ. బెదరెడు లేడికూన మఱపించుచు నక్కునఁ జేర్చి, కన్నులన్
బ్రిదిరెడు తేనెరెప్పలను మ్రింగి, దయామృదులాక్షరంబులన్
బెదవి గదల్చి దీవనలఁ బెట్టిన వల్పలి కేలు చెమ్మటల్
చిదు మఁగఁదాఁకి, "లెమ్ము శివజీ"యని యల్లన లేవనెత్తుచున్. 17.

ఉ. ఆదరమారఁ జెంత నుచితాసన మందగఁజేసి, తండ్రి మ
ర్యాద హితంబు సూపి, శివరాజున కిట్లనె రామదాసు, "వ
త్సా! దురితక్రమంబులు ప్రజాహిత కార్యములందు రేఁబవ
ల్బీఁదుచునున్న నీకుఁ గలదే యొక తీరిక మమ్ముఁ జూడఁగన్! 18.

ఉ. కొన్ని దినంబులౌచు మదిఁ గోరికయున్నది నిన్నుఁజూడ, నై
న న్నిలుచున్నచో నిలక నల్గడఁ గార్యము వెంట దూఁకు నీ
సన్నిధి చిక్కదయ్యెఁ; గడసారికి నేఁటికిఁ జూడఁగంటి నో
యన్న! నినున్ గలంపవుగదా పగదారుల మాయమర్మముల్? 19.

ఉ. అండనయుండి కార్యగతు లారయఁ జేయఁగఁ దండ్రిదూరమై
యుండె, గురుండుఁ దండ్రియగు నుత్తమ విప్రుఁడు ఖాండదేవు వే
ఱొండు జగంబుఁజేరె, నిపుడొక్కఁడవున్ దరుణుండవౌచు, ను
ద్దండము లీప్రభుత్వముల వందడి నేగతి నాఁగి నీఁగెదో! 20.

ఉ. పాయనికూర్మి నీకు నిరపాయ పథమ్మును జూపఁగా నుపా
ధ్యాయు, తపస్సహాయు, భవదంబ దయాజగదంబ జీజియా
బాయికి సేమమే? సుగుణ బంధుర బాంధవ సింధువౌ సయీ
బాయికి నీ వధూమణికి భద్రమె? నీప్రజకెల్ల శ్రేయమే?" 26.

చ. అను గురువర్యు నాదరణ మందుచు సాంద్రసుధారసాభిషే
చనమునఁ బోలె నెమ్మనము చల్లనగా శివరాజువల్కె, "మీ
ఘన కరుణావలంబనము గల్గిననాఁడె శుభోదయంబు మా
కొనరినదయ్యె, నేకొఱఁతయున్ గలదే సురధేను సన్నిధిన్! 22.

మ. గురుజీ! మీరనినట్లు కార్యముల చిక్కుల్ పెక్కులైయున్న, నీ
శ్వరచింతా పరతంత్రమౌచు మదినిచ్చల్ సాధుసేవా సమా

దరముల్ గోరెడు; వేచియుంటి మిముఁ జెందన్ బెద్దయున్ బ్రొద్దు; నె
త్తురు పొత్తుం గుడిపించు రాచఱిక మెందున్ విందు చేకూర్చునే! 23.

చ. జనకుఁడు దూరమాఁచుఁ బితృసమ్మితుఁడౌ గురు ఖాండదేవుఁ డే
గిన నోఱఁ దోపకుండ నుడికించితి రాచఱికంపుఁ జిక్కు, లై
నను మఱి కొన్నియూహలు పెనంబడుచుండె మనంబునందు; నా
కనువగు ధర్మనిర్ణయము నందుటకై మిము నాశ్రయించితిన్. 24.

ఉ. రాచఱికంబునన్ గలదు తాఁగఁదనంబు, కసాయిచేత, మా
యాచరణంబు; ధర్మపథమైనను దప్ప దొకప్పు డాత్మ సం
కోచము; రాజనీతి యనుకొన్నను నోదముపైని పైరుగాఁ
దోఁచుఁ; బ్రభుత్వముల్ నరక దుర్గములంచని పెద్దలాడరే! 25.

ఉ. కొందఱఁ జేతఁబట్టి, మఱికొందఱనున్ దలక్రిందు సేసి, రా
జ్యేందిర పేర రక్తబలి యిచ్చుట యెవ్వరికోస? మీశ్వరుం
డందఱఁ గావఁడే? ప్రకృతి యంతయుఁ బండదె జీవభుక్తికై
నందిన? సోమ రే యిన ఘన శ్వసనాదులు పూట కాఁపులై? 26.

ఉ. నామది నింతవట్టు మననం బగుచుండు; మతమ్ము దేశమున్
బ్రామిన చీఁకటిన్ దలఁచు పట్టునఁ బట్టఁగ రాని కెంపు పెం
పై మెఱపాడు; దానికొఱ కాయుధమెత్తినఁ 'గ్రూరకర్మ మా
నేమొ' యటంచు 'శాంతి బలహీనతయా' యనియున్ దలంపగున్.27.

మ. 'మనకింతే'లని యూరకుంట విబుధుల్ మన్నింప; రన్నింటికే
ననుచున్ దూఁకిన లోకమే పెడమొగం బౌనట్టులా; నీయెడన్
మనుజుం డెట్లు చరింపఁ గావలె? మహామాయామయం బీ జగం
బనుచున్ మానులు పట్టుదారియ ఘనంబై గమ్యమై యుండునో? 28.

చ. అదియగు నేని రాచఱికమం చౌకబంధ మిదేల? యెవ్వరే
నొదుఁగుచు రాజకల్పిత నియోగములన్ జను టేల? యిట్టి సం
పద యెటుగల్గె రాజునకుఁ? బాపము లాతని కంటవో? బలో
న్మదమున రేఁగి పైకొనెడు మానవులెల్లరు రాజులౌదురో? 29.

ఉ. ఈమెయిఁ దాఁటసిల్లెడు ననేక తరంగములెత్తి సంకులం
బౌమది నిర్ణయంబు కొఱకాఁ గలిఁగొన్నది; పూజ్యుఁడౌ తుకా
రాముఁడు 'ధర్మసంగరము రాజుల కర్హ' మటంచుఁ దెల్పి వి
ద్యామయ నిన్నుఁ జేరుమనె; సంకిలివో మదినూలుకొల్పవే!" 30.

చ. అను శివరాజు చిత్తమున హత్తిన యొత్తిడిఁజూచి విస్మితా
ననుఁడయి రామదాసముని నాథుఁడు వల్కెఁ "గుమార! నీ వచిం
చిన దుచితంబ; ధర్మపరిశీలన సేయుచుఁ బాపపుణ్యముల్
గని, నిరపాయ వృత్తి మెలఁగన్ దలఁపొందిన నింత యొప్పదే! 31.

ఉ. మానవ జీవితంబు సుకుమారము, స్వార్థ పరార్థ సౌఖ్య సం
ధానముతో మదిన్ దనుపు తత్పరమార్థము; స్వార్థవృత్తి యం
దైనను గేవలైహిక సమాహృతి రాజస తామసాంక, మా
మానులు ముక్తికై నడచు మార్గము స్వార్థము, సాత్త్వికంబగున్. 32.

చ. తగులము లేక, యాసలకు దాసులుగాక, తమంత పండి పై
రగు ఫలమూల శాకములనంది, బహిర్గత పంచభూత శ
క్తిఁ గొనుచు నాత్మముక్తి పరికించుట యొక్క తెఱంగు; దీని మే
లుగొనరు గొంద ఱాత్మసుఖ లోభ మభూతహితత్వ మెన్నుచున్. 33.

తే. గుడిసెలోఁ గన్నుమూసి, పైఁదొడరు భూత
ములకు మేనిచ్చి, లోని శత్రులనె యడఁచి
జగము నంటని ముని తపశ్చర్య స్వార్థ;
మట్లుపోని రాజర్షి పరార్థపరుఁడు. 34.

తే. తన్నుఁ బోలిన సకలభూతములు దనియఁ
దానుమురియుటె మానవత్వంపు గుఱుతు;
దాని సాధించుటే పరార్థమగు, నందుఁ
దెరువులివి, రాజసంబు సాత్త్వికమనంగ. 35.

మ. తనకేమేలు దలంప, కన్యహిత చింతన్ బ్రాభవంబంది, శా
సన శక్తిన్ జగమోము రాజసమగున్, సామప్రబోధంబునన్.
దనుపొందించుట సాత్త్వికం బిటుల ముక్తప్రాయులౌ జ్ఞానియున్
జననాథుండు పరార్థమున్ గొనుదురంత శ్శాంతి దైవారినన్. 36.

చ. ఒదవిన రెండుమార్గముల యోగ్యము సాత్త్వికమైన, మూఢమూ
ర్ఖ దశల గండరించిన జగంబున మేలుఘటింప రాజసం
బదికిన యట్లుగా ఫలసమగ్ర దశన్ నియమించి నిల్పఁ జా
ల; దవుట శాంత రాజసకళా పరిపాకము సాధనంబగున్. 37.

తే. దాన స్వార్థముఁగోరు భూధవులకంటె
మునులు మేలు; వారలకంటె మొగిఁ బరార్థ
సాధకులు మేలు; వారిలో జ్ఞానధనుని
కంటె రాజర్షి శాంతి రక్షకుఁడు మేలు. 38.

తే. వినుము శివజీ! పరార్థమున్ బెనుచు నపుడు
జ్ఞాన ధనుకంటె శాంతిరక్షకున కన్ని
గతుల నోఋపును గల, దన్నిగతుల విఋపుఁ
గల, దది పరుల రంజించు కత్తిసాము. 39.

ఉ. రాజతపస్వియై భువనరంజకతన్ వెలయించుచే సుధా
భాజన ముద్ధరించుట; యపార పయోధి మథించునాఁటి వి
ద్యా జటిలత్వ మబ్బినఁ గదా సకలమ్ము దమింపుచున్ బయో
భోజన మిచ్చుఁ! బెత్తనముఁ బొందుటనన్ బయిపైన నున్నదే! 40.

ఉ. వేఁడిమి సూపరా, దొరల వేఁడినచో బలహీనవృత్తి, బొం
కాడుట కానికార్యము, యథార్థత లోకవిరోధి; మేలునన్
గీడునఁ బోలెఁ గీడు పరికించు జగంబున నెల్లవారు 'మా
వాఁ'డన రాజనీతి నడుపన్ దరమే యొకపాటి వానికిన్. 41.

మ. ప్రతికూలంబులడంచి మేలు గలిగింపన్ బూని, గాఢాభిమా
న తరంగోద్ధతి రేఁగి దూఁకునెడ విఘ్నవ్రాతముల్ లేచి ప
ర్వతములోలెఁ నెదుర్చు, వాని నోదిగింపన్ ధీరు లేనప్పు, డు
ద్ధతుఁడౌ రాజసయోగి క్రుంగియడఁగున్ దైవంబు సాధించుచున్. 42.

ఉ. లాఁతుల కిట్లడంగుటయు లాఘవమై కను పట్టుఁ; బోరఁగాఁ
జేతులురాని రాజముని సేగి దమింపఁగ నోపఁ; డట్టియా
కూత మెఱుంగు వారు దొసఁగున్ దగవెంచక స్వార్థసిద్ధి కు
ఱ్ఱూఁతలు వోదు; రీజగ మయోమయమై కనులుండి లేవగున్. 43.

తే. ఇంత యురవడి కెదురీఁది, యింతకంత
కులికి వడక, యెడంద కాయువును బోసి
పరహితముఁ, బెంపవలెఁగాక బమ్మరింపఁ
దగదు; తగవెల్ల సృష్టితత్త్వమునఁ గలదు. 44.

ఉ. సృష్టి పరస్పరాశ్రయ పరీతమయయ్యు స్వత స్స్వతంత్రతా
పుష్టము, భిన్నమార్గములఁ బోకడ నైజము న్యాయమయ్యు, ను
త్కృష్టము తన్ని కృష్ట మడగించెడి, ధర్మపదార్థమిట్లు సం
సృష్టము సంకరం బగుటఁజేసి సమన్వయశక్తి కావలెన్. 45.

తే. ఆ సమన్వయ మకరంద మందుకొఱకు
మధుకరము పూవుఁ బొదరిండ్ల మలయునట్లు
ప్రకృతి యంతట సృష్టిమర్మముల నెమికి
తరిచి పొరలెత్తి చవులంటు వెరవు వలయు. 46.

ఉ. అట్టి సమన్వయంబు ఘనులైన మహాత్ములకైనఁ బూర్తిగాఁ
బట్టదు దైవశక్తి బిగబట్టిన వారికిఁగాక, వారికీ
చుట్టఱికంబు గిట్టదు విశుద్ధ సమాధి లయంబుగాక; యి
ప్పట్టున లోకసుస్థితి కెవండు సమర్థుఁడు తోఁడు సూపెడున్. 47.

మ. తనముక్తిఁ దలపోయు సంయమి; పరార్థం బెంచు విజ్ఞానియున్
వినినన్ మేలువచించు, ధర్మగతుల న్వేషించు రాజర్షి పూ
నినచోఁ గాక సమాధి నిష్ఠుఁ డయిఁకన్ నిర్భీకమై లోకమె
వ్వనికిన్ వాఁడుగఁ దాండవించు; నిటు విధ్వస్తంబు ధర్మంబగున్. 48.

ఉ. ఉన్నది దైవరక్ష, సకలోపకృతుల్ ప్రకృతిన్ ఫలించియే
యున్నవి, భూతశక్తి జగమోయుచునున్నది, కాని, లోకమా
యున్నతి కోసమై పెరఁగి యొండొకటిన్ గబళించుచున్నదీ
చెన్నటి చీఁకటిన్ బాడుగుచేతులు పైకొని విక్రమించెడున్. 49.

తే. దొరలమని యస్త్రశస్త్ర బంధురత నెఱపి
తెలివిగలమని పెను కుయుక్తులను జొనిపి
జగముఁ గబళించు బలియుగఁ జక్కఁబఱుప
నున్నఁ దెవరున్న? వారూర కొదుఁగఁగలరె? 50.

ఉ. అట్టి ప్రజాపకారము బయల్పడ ధీరుఁడు సైఁపఁగూడ; ద
ప్పట్టున సామదానములు పాఱనియప్పుడు భేదదండముల్
ముట్టక తీఱవందు రణముల్ మరణంబులు నోర్చి, కత్తులన్
గట్టుచు నెత్తురుల్ గురిసిగాక తొలంగునె దుర్విహారముల్? 51.

ఉ. ఇంతలుసేయుచున్న ఫలియింపదొకప్పుడు లోకమంగళం;
బింతలుసేఁత హింస యగునేమొయటం చొకజంతుదోఁచు; నా
స్వాంతమునందు లోకహిత యజ్ఞముగా నిదియెంతు, వేదసి
ద్ధాంతము యజ్ఞముత్తమమటం, చదియున్ బరులందు హింసగన్,

చ. ఇది దరిలేనిసాగర మహింసయు హింసయు నిర్ణయింప; నె
య్యది ననఁ బ్రాణికోటి కహితాచరణంబది హింస; యైన స్వా
భ్యుదయముఁగోరిగాక జగదున్నతికై యొనరించు కార్యమం
దొదవిన హింసయున్ ఫలశతోన్నతమౌచు నహింస నాఁబడున్. 53.

క. ఇటులగుట లోకరక్షా
ఘటన యవశ్యంబు చేయఁగాఁదగు, దానన్

జటులత కుటిలత హింసా
పటుతయుఁ గొనరాదు స్వార్థపరత యొసఁగమిన్. 54.

తే. స్వార్థమునఁ గూడఁ దారతమ్యంబు గలదు;
తొలుతఁ దాను, గుటుంబము, కులము, జాతి
యిందు స్వార్థము క్రమముగా డింది, కడక
ధర్మమే ధర్మమగుఁ బరార్థమునఁ దవిలి. 55.

క. 'నా' యనునది లేని జగ
చ్ఛ్రేయంబ పరార్థ; మది భరించుటయందే
నాయకుఁడొకఁడు సమస్తో
పాయవిదుఁడు వలయు నతఁడె ప్రభువనొప్పున్. 56.

ఉ. ఆ చతురుండొనర్చు జగదాదృతి రాచఱికంబు నాఁబడున్;
రాచఱికంబునన్ గలదు ఱాఁగఁదనంబు, కసాయిచేఁత మా
యాచరణంబు నంటివిగదా! యది స్వార్థముగొన్నదృష్టి, ధ
ర్మాచరణంబునం దతని కంటవు తద్గత పాపపంకముల్. 57.

ఉ. పాపములంటఁబోని గునపంబునఁ బువ్వులతోఁటఁబెంచి, న
ల్లైవులవిచ్చుపూల పొలపంబునకున్ దలయూఁచి. కన్నునన్
జేసిన తోఁటకాఁపువలెఁ, జేకొనుధన్యత, దేవపూజకున్
బ్రాపగు; లోకనిర్వృతికిఁ బట్టగు నాతఁడు ధర్మకర్తయై. 58.

క. ఈగతి, లోకోద్ధరణ
శ్రీ గురుభారమును దలధరించిన స్వార్థ
త్యాగి విధించెడు శిక్షా
భాగంబది రాజనీతిపథము, కుమారా! 59.

ఉ. నీమములేనిచోఁ దగవునేర్వఁడు లోకము తానుదా నహం
తామమతా పురస్కృతపథంబది; కావున ధర్మబద్ధుఁడై
సేమముఁగూర్పఁగా నడరు సేగినిఁ దీర్పఁగజాలు ప్రాభవో
ద్దాముఁడు రాజు, కావలె నతంద్రము, కావలె రాజనీతియున్. 60.

ఉ. రాజనమర్త్యమాత్రుఁడనరాదు, జనార్దనమూర్తి; యష్ట ది
గ్రాజులయంశ, మునిరాజ తపంబుల షష్ఠభాగమున్
బూజితవృత్తిఁ గొంచు జగమున్ నడిపించు నియంత; వానిశి
క్షా జటిలాతపం బఘము గ్రాఁచుఁ, బదంపడి కాయువెన్నెలన్. 61.

చ. బలితపు టెండలన్ దెవులు వాసిన మొక్కలు చల్వవెన్నెలల్
వాలసిన సేదదేఱి, తనువున్ బెనుపున్ గొని పూచుఁగాచు, నీ
లలి నరపాల శిక్షణబలంబున సంస్కృతమౌ జగంబు సా
ధుల వచనంబులన్ దెలివిఁదోఁగి, పరాపర సిద్ధిఁ బొల్చెడిన్. 62.

తే. నావచించిన యర్థమంతయును నేఁటి
హైందవ జగంబునకు నీకు నన్వయించి
ధర్మదండము నభయహస్తమునఁ బూన్చి
పంచినదినూవె నిన్ను భవాని మాత! 63.

ఉ. కావున భూపతీ! ప్రజలఁ గాచుట నీవిధి; నేలదున్నుచో
నావులఁ గాచుచోఁ, బ్రజల నారయుచోఁ, బ్రతికూలశిక్ష హిం
సావిధిగా, దుపేక్ష బలశాలికిఁ బాపముఁగూర్చు; నీకు నే
లా వెనుదీయ? నీశ్వర విలాసము నీకరమందెఁ బండెడున్. 64.

మ. మతమున్ దేశముఁ బ్రాణతుల్యముగ సంభావించు నీతీరు, సం
తతమున్ నీవొనరించు తద్బహుళసన్నాహంబు, రాఁబోవు ను
న్నతికిన్ గుర్తులు; భూతభావి చరితాంతర్యంబుఁ, 'గన్నారఁ జూ
చితి' మన్నన్ గొఱలేదు; నీవలన సుశ్రీ భారతంబందెడున్. 65.

చ. అఱమది మాని ధర్మవిజయధ్వజమెత్తి, పరాధికార జ
ర్ఝరితము దేశమున్ మతముఁ జక్కనొనర్పుము, భారమెల్ల నీ
యఱకడఁ బూనుచో సమయమారసి నీవెను వెంటఁ దాము వ
త్తురు మనహైందవ ప్రజలు, తోడ్పడెదున్ మముబోంట్లు దీవనల్.

ఉ. ఆవును లేఁగయున్ బరుల యాఁకటి కమ్ముడువోవఁ, దీవలున్
పూవులు వోని స్త్రీచరితముల్ కడునాఱడిఁ బొంద, దేవుఁడున్

గోవెల రూపుమాసి వెడఁగోఁతల రోఁతల బుగ్గిఁ దేల వ
త్సా! వెనుదీసి పోవిడుతువా భరతావని భాగ్యసంపదల్ ? 67.

ఉ. ఆ రవినుండి నేఁటి వఱకానికఁ బూని బుజమ్ములొడ్డి, భూ
భారము మోయు వంగడము పాదునఁ బుట్టిన మొక్క తత్ప్రభన్
మీఱకయున్నె ? పంచిన యమిత్రకులంబులు దాని పెంపునన్
దీఱక పోవునే ? శివపతీ! తెరదీయుము వీరలక్ష్మికిన్. 68.

తే. వేసముల మాఱు ధర్మ జిజ్ఞాస నీకు
వలదు, వలదట్టి పుణ్యాపాపముల గొడవ,
రాచ బిడ్డవు ధర్మశస్త్రమున దున్ని
పంట గొలుపుమీ యిహపర భాగ్యలక్ష్మి. 69.

ఉ. కాఁపరిలేని గోగణము కైవడి భారతభూమి ధర్మర
క్షాపరులైన క్షత్రియులఁ గానక ముష్కర తస్కరాళిచే
నేమఱి, నీపయిన్ బరువులెత్తెడు నాసల వేచియుండె; బా
హాపరిణాహ ధూర్వహుఁడవై శివరాజ! భరింపు మీ ధరణ్. 70.

మ. చివురుం జెక్కులు చిమ్మరింప విజయశ్రీ నీవు సాధించుచోఁ
గవియున్ జిక్కులు పెక్కు, లొక్కమొగి లోకంబెల్ల లోఁగొన్న యీ
యవనాధీశు లెదుర్తు, రబ్ధిమథనంబే: నేఁటిపోరాటలో
శివజీ! యంగిటఁ జేఁదునాఁపి యమృత శ్రీయిమ్ము నీవారికిణ్. 71.

చ. 'మునుకలు వెట్టు దేశమతముల్ దరిజేర్పఁగ ధీరుఁ డెవ్వఁడా'
యని నినుఁ గంటి, గంటి భవదాశయ; మీ నినుఁ బ్రోత్సహింపఁగా
బనిగొని ధర్మగీతములు వ్రాసితి; నాతలపుణ్ వచించి నె
మ్మనమున నూరడిల్లితిఁ, గుమార! సమీహిత మీవచూడుమీ!"

చ. అను మునిరామదాసు వచనామృతమున్ మనసారఁ గ్రోలి, త
న్నున నిలువెల్లఁ బొంగి శివభూపతి యిట్లనె, "ఓమహాత్మ! నా
మనసు కలంకవాసెఁ, జిఱుమబ్బులు మాసె, సుషస్సమాధి మే
లొక్కని యుగుణుండు దూసె- మునికోలఁ, జరింతు జగద్ధితార్థినై." 73.

మ. తమయాజ్ఞన్ శిరసావహింపుచు నుదాత్త క్షాత్రధర్మంబు కృ
త్యముగాఁ దీర్చెదఁ బాపపుణ్య విచికిత్సల్ వోవ నాకేల! రా
జ్యము నెల్లన్ గురుదక్షిణాత్మకముగా నర్పించితిన్ మీకుఁ బూ
జ్యముగా నేలుఁడు; గైకొనుండు నను హస్తాలంబ దండంబుగన్. 74.

మ. గురుజీ! సుందర కందర ద్రుమ తటీ కుంజాసగా రమ్య మీ
పరళీ పర్వతదుర్గమందు వసతిం బాటింపుఁ; డేఁ బల్మరున్
దరిసింతున్ మిము; నేఁటి నుండియు భవద్రాజ్యంబుగాఁ జాట భా
స్వర కాషాయపతాకయెత్తి 'భగవాజండాఁ' బ్రతిష్ఠించెదన్" 75.

చ. అను పలుకాలకించి పులకాంచితుఁడై ముని రామదాసుఁ డి
ట్లనె "శివజీ! త్వదీప్సితమ యయ్యెడుఁగాక! విరక్తి సన్న్యసిం
చిన ననుఁబోఁటికిన్ భువన శిక్షణ రక్షణలేల? నీవ నా
యనుమతి నేలు మీయిల సమస్త మహాస్త్ర రజస్తమంబుగన్. 76.

చ. వెరవును లావు గూర్చి నడిపింపఁగ నేర్తువు రాజనీతి; నీ
కొరులుపదేశమీయఁ బనియుండదు; నేదరిలేని యవ్వా డ
క్కఱగలచోఁ జరించెదవుగాక మదీయము దాసబోధ; భూ
వర! హిత సర్వధర్మపరిపాలకము నీ కలదానఁ జేకుఱున్. 77.

చ. నలుగడఁ జిక్కులంటుచు మనంబునఁ ద్రొక్కట మీఱుచో ననా
కుల మతి శాలివై శరణుగోరుము నీకులదైవతమ్ము; ని
ర్మల ముకురంబునందువలె మానసమందు భవాని తోఁచినీ
యులు కెడలించుఁ; బూఁట వడియున్నదిగా భవదన్వయర్ధికై! 78.

ఉ. కూరిమి వోయుచున్ నుదుటఁగుంకుమువెట్టి, సఖడ్గపాణికిన్
దోరముగట్టి వెన్నొరయు తూణమునన్ జయలక్ష్మి వెట్టి, హృ
న్నీరజమందుఁ దానిలిచి నిన్ నడిపించు భవాని; యెందుఁబో
స్వారికి నీ పటాణి గొరిజన్ దడి యుంటఁగనీక త్రిప్పెడున్. 79.

మ. శివజీ! లెమ్మిది దాసబోధ, మిదియే శ్రీచక్ర పూజాసర్జం,
బివి నాదీనన లిన్నిటిన్ గర శిరో హృత్సీమల న్నిల్పి, యు
త్సవ ముత్సాహము దోహలింప, భరత స్వాతంత్ర్య దీక్షాంతమహా
సవనంబున్ జరిగింపు; మాభువన రక్షాకర్త్రి నిన్నోమెడున్! 80.

చ. చనుము కుమార! నీవు సువిశాల మహీవలయమ్మునెల్లఁ బ
చ్చని పయి రిచ్చగించు వ్యవసాయ ఘనుండవు; నాల్గుమూలలన్
బనులు మఱెన్నియో పెనఁకువల్ నినుముట్టఁగనుండు; నన్నిటన్
గనుఁగవ గల్గియుండు, మవుఁగావుత నీకు జయమ్ము కీర్తియున్." 81.

---

# 1. నన్నయ భట్టారకుఁడు

## కవి పరిచయము :—

ఆంధ్రకవులలో నన్నయ భట్టారకుఁడు మొదటివాఁడు. ఈ కవి తల్లజుఁడు రాజమహేంద్రవరము రాజధానిగా వేఁగిదేశమును పరిపాలించిన వాఁడును, చాళుక్యవంశీయుఁడును నగు రాజరాజ నరేంద్రుని యాస్థాన విద్వాంసుఁడై యుండెను. ఈతఁడు క్రీ. శ. పదునొకండవ శతాబ్దమందున్నవాఁడు. ఈ రాజశేఖరుఁడు ప్రేరేపింపఁగా నన్నయభట్టారకుఁడు సంస్కృతమునందున్న మహాభారతము నాంధ్రభాషలోని కనువదించుటకు పూనుకొనెను. సంస్కృతములో వేదవ్యాస మహర్షి మహాభారతమును రచించెను. అది పదునెనిమిది పర్వముల మహాగ్రంథము. సర్వధర్మములకును నిలయమైనది. కావుననే దానికి పంచమ వేదమని ప్రసిద్ధి గలిగినది. భారతీయులచే అతి పవిత్రమైన గ్రంథముగా సంభావింపఁ బడునట్టి భగవద్గీత యీ మహాభారతమునందలి భాగమే. వివిధ ధర్మములను నీతులను బోధించు నితిహాసములతో విరాజిల్లు నీ గ్రంథరాజము పురాణములలోనికెల్ల మేలుబంతి యనఁదగి యున్నది. తానురచించిన యీ మహాభారతమును వేదవ్యాస మహర్షి మొదట తన శిష్యుఁడైన వైశంపాయనున కుపదేశించెను. ఆ వైశంపాయన మహర్షి జనమేజయ మహారాజునకు చెప్పెను. అట్టిదానిని సూతమహర్షి శౌనకాది మహర్షులకు బోధించెను. సంస్కృతము తెలియని ప్రజల కా యా ధర్మములు సులభముగా తెలియుటకొఱకు రాజరాజ నరేంద్రుఁడు నన్నయ భట్టారకు నేతద్గ్రంథ రచనమునకు ప్రేరేపించెను.

నన్నయ భట్టారకుడు మహావిద్వాంసుడు. వేదాధ్యయనముఁ గావించినవాఁడు. అవిరళముగా జపహోమాదులఁ గావించు నైష్ఠికుఁడు. బ్రహ్మాండాది నానాపురాణముల తత్త్వార్థము లెఱింగినవాఁడు. సంస్కృ

తాంధ్రభాషలలో కావ్యనిర్మాణ నైపుణ్యము గలవాఁడు. బుద్ధియందు బృహస్పతికి సాటి. ఆపస్తంబ సూత్రుఁడును, ముద్గల గోత్రుఁడునైన సద్బ్రాహ్మణుఁడు. వైదుష్యముతోఁ బాటులోకజ్ఞతయు లెస్సగఁ గలవాఁడగుట ఇట్టి మహాగ్రంథ రచనమునకు సర్వథా అర్హుఁడాయెను. దుర్ఘటమైన యీ మహాభారత రచనా వ్యవసాయమున బహుభాషా కోవిదుఁడును తనకు సహాధ్యాయియు నైన నారాయణ భట్టను విద్వాంసుఁడు తనకుఁ దోడ్పడెనని గ్రంథారంభమున నన్నయభట్టారకుఁడే తెలిపెను.

నన్నయభట్టు ఆది సభాపర్వములను పూర్తిగను అరణ్య పర్వములో చతుర్థాశ్వాసములో కొంతవఱకును రచించెను. ఆ మహా కవి రచనము ఓజో గుణసహితమై గంగా ప్రవాహమువలె నుండును. కథా కథన సంవిధానమునందలి కౌశల్యముచేతను, అక్షర రామణీయత చేతను, నన్నపార్యుని కవిత యెల్లరకును మోదము గూర్చుచుండును. విరాట పర్వమాదిగాగల పదునైదు పర్వములను తిక్కన సోమయాజియు, నన్నయ విడిచిన యరణ్య పర్వభాగము నెఱ్ఱాప్రెగడయు రచించిరి. ఈ విధముగా నాంధ్ర మహాభారతము ముగ్గురు మహాకవులచే పూర్తి గావింపఁబడినది. వీరినే కవిత్రయమందురు. వీరిలోను నన్నయ మొదటివాఁడు గావున నాది కవియని ప్రసిద్ధి పొందినాఁడు. ఈతనికి శబ్ద శాసనుఁడనియు, వాగనుశాసనుఁడనియు బిరుదులు గలవు. ఈతఁడు "ఆంధ్ర శబ్దచింతామణి" యను వ్యాకరణ గ్రంథమును గూడ రచించెను.

### పాఠ్యభాగ పరిచయము :—

పాఠ్యభాగమైన దుష్యంత మహారాజు చరిత్ర నన్నయభట్ట రచితమైన మహాభారతము ఆదిపర్వమున చతుర్థాశ్వాసమునఁ గలదు. పూరువంశీయులలో ప్రసిద్ధుఁడగు నిలల మహారాజునకును రథంతరి మహాదేవికిని దుష్యంతుఁడు జన్మించెను. తండ్రి తరువాత చక్రవర్తి

యైన దుష్యంతుఁడు వేఁటవశమున కణ్వాశ్రమమున కేగెను. అచ్చట నాతఁడు శకుంతలను చూచి యామె మేనకా విశ్వామిత్రుల కుమార్తె యగుటఁ దెలిసికొని క్షత్రియుఁడగు తాను వివాహమాడ యోగ్యనుగా గుర్తించి యామెకు గల్గు పుత్త్రునకే తన పిమ్మట చక్రవర్తిత్వము నీయ మాట యిచ్చి, గాంధర్వ విధిని పెండ్లియాడెను. ఆమెను రాజధానీ నగరమునకుఁ దోడ్కొని పోవదగిన పరివారమునుఁ బంపెదనని చెప్పి వెడలిపోయెను. ఇట గర్భవతియైన శకుంతల మూఁడేండ్లు గర్భము మోసి యొక మగ శిశువును గనెను. ఆతఁడే భారత వంశమునకు మూలపురుషుఁడైన భరతుఁడు. కణ్వమహర్షి యెంత కాలమునకును దుష్యంతుఁడు తన భార్యను తోడ్కొని పోవుటకు పరివారమును పంప కుండుటచేతఁ దన శిష్యులను తోడిచ్చి కొడుకుతోఁగూడ శకుంతలను రాజధానికిఁ బంపెను. రాజు శకుంతలను చూచియు నెఱుఁగని వానివలె మాటలాడుటచే శకుంతల తానాతని భార్యననియు తన పుత్త్రునిఁ జూపి యీతఁడు తమ పుత్త్రుఁడేయనియు, తమ్ము స్వీకరింపవలసిన దనియు, అసత్యమాడుట పాడిగాదనియు, తమ వివాహమునకు పంచభూతములును, సూర్య చంద్రాదులును సాక్షులనియు వాదించెను. అశరీరవాణియు శకుంతల చెప్పినదెంతయు యథార్థమని పలికెను. అంతట రాజు తానంతయు నెఱిఁగియే యుండియు గాంధర్వ వివాహము రహస్యముగా జరిగిన దగుటచే ప్రజలు విశ్వసింపరని యట్లు నటించితినని చెప్పి భార్యాపుత్త్రులను స్వీకరించెను. ఈ కథాంశమిందు హృద్యముగా నభివర్ణితమై యున్నది.

---

# 2. శ్రీనాథుఁడు

## కవి పరిచయము :—

మధ్యయుగ కవులలో శ్రీనాథుఁడు మేటి యనఁదగినవాఁడు. ఈతఁడు క్రీ. శ. 1375 నుండి 1455 వఱకు నుండెనని చెప్పవచ్చును. ఈతఁడు బాల్యమునుండియే గ్రంథరచనము సాగించినదిట్టు. పాండిత్యము, ప్రతిభ, ధారాశుద్ధి యను కవితాసామగ్రి లెస్సగా కలిగిన వాఁడౌట శ్రీనాథుఁడు మహాకవి శ్రేణిలోఁ జేర్పఁ దగినవాఁడు. కవిత్రయము తరువాత శ్రీనాథుని మించినకవి లేఁడనవచ్చును. తనకుఁ బూర్వ మందున్న మహాకవులలో నొక్కొక్కరి యందుఁ బ్రత్యేకముగా నున్న కవితాగుణములను గుర్తించి వానిని స్వాయత్తీకరించుకొని తన కవితలో నాయాపట్ల వానిని వెలయింపఁజేసి సహృదయులచే మేల్మేలనిపించు కొన్న చతురుఁడు శ్రీనాథుఁడు.

శ్రీనాథుఁడు తొలుత కొండవీటి రాజులకడ విద్యాధికారి పదవి నలంకరించియుండెను. అటుపిమ్మట రాజమహేంద్రవరమును పరిపాలించిన రెడ్డిరాజుల యాశ్రయము పొందెను. ఈ మహాకవి రసవత్కవిత యానాఁటి రసికుల నెందఱనో యాకర్షించెను. మహారాజులు, సచివ శేఖరులు, సామంతులు, వణిక్ప్రభువులు మొదలుగా నెంద ఱెందఱో యీ మహాకవిని సమాదరించి సత్కృతులు వెలయింపఁజేసిరి. శ్రీనాథుని కవితాపరిమళములు గుబాళింపని తావే యానాఁడు తెలుఁగుదేశమున లేదనవచ్చును. ఆతఁడాంధ్రదేశ మెల్ల పర్యటించి యాయా ప్రభువుల చేతను, కావ్యరసాభిజ్ఞులగు నితరధనికులచేతను అనితరకవి లభ్యములగు ననేక గౌరవములను పొందెను. కవియేగాక యాతఁడు శాస్త్రపాండి త్యమునందును నసమానుఁడగుటచే విజయనగరమున కేగి యచ్చటి పండితులలో నుద్దండుడగు గౌడడిండిమ భట్టును శాస్త్రవాదమున నోడించి యాతని కంచు ఢక్కను వ్రక్కలు చేయించెను. కవిసార్వ

భావ బిరుదును సంపాదించుటయేగాక ప్రౌఢదేవరాయనిచేఁ గనకాభిషేకమును గూడఁ బొందెను.

చిఱుతకూఁకటినాఁడే శబ్దములల్ల మొదలిడిన యీ ప్రజ్ఞాశాలి రచించిన గ్రంథములలో ముఖ్యమైనవి :— (1) మరుత్తరాట్చరిత్ర, (2) శాలివాహనసప్తశతి, (3) పండితారాధ్య చరిత్రము. (4) పల్నాటి వీరచరిత్ర, (5) శృంగార నైషధము, (6) భీమఖండము, (7) కాశీ ఖండము, (8) హరవిలాసము, (9) శివరాత్రిమాహాత్మ్యము. క్రీడాభిరామమను గ్రంథము వినుకొండ వల్లభామాత్యునిపేర నేఁడు కనఁబడుచున్నను శ్రీనాథుఁడే తత్కర్తయని విమర్శకులు తలంచుచున్నారు.

కథా సందర్భము :—

పార్శ్వభాగమైన కిరాతార్జునీయము శ్రీనాథుని హరవిలాసములోని సప్తమాశ్వాసమునుండి గ్రహింపఁబడినది.

ఈ హరవిలాసము అవచితిప్పయ యను వైశ్యశ్రేష్ఠున కంకితమీయఁ బడినది. ఈ తిప్పయశ్రేష్ఠి కొండవీటి రాజులకడ సుగంధభాండాగారాధ్యక్షుఁడై యున్న మహా ధనికుఁడు. ఈతఁడు కాంచీపుర నివాసి.

అర్జునుఁడు పాశుపతాస్త్ర లాభమునకై పరమేశు నుద్దేశించి తపముఁ జేయుటయు, పరమేశ్వరుఁడు పార్థుని సామర్థ్యమును పరీక్షించుటకై మాయాకిరాతుఁడై వచ్చుటయు, తాను వేఁటాడుచు వచ్చి శరమునఁ గొట్టిన యావరాహముపై అస్త్రమును ప్రయోగించి తనదిగాఁ జేసికొనఁ జూచుచున్నట్లున్న యర్జును నధిక్షేపింప నుభయులకును కయ్యమగుటయు, నందు పార్థుఁడు చూపిన మగఁటిమికి పరమేశ్వరుఁడు సంతసించి పాశుపతాస్త్రము ననుగ్రహించుటయు నను కథాంశములిందు నిబద్ధింపఁబడినవి.

---

# 3. తంజావూరి రఘునాథ భూపాలుఁడు

## కవి పరిచయము :—

రఘునాథ భూపాలుఁడు తంజావూరు రాజ్యమును పరిపాలించిన తెలుఁగు నాయక రాజులలో తలమానిక మనఁదగినవాఁడు. తళ్ళికోట యుద్ధ పర్యవసానముగా విజయనగర సామ్రాజ్యమునకు కొంత భంగ పాటు కల్గుటయు, పిమ్మట నారాజులు తమ రాజధానిని పెనుగొండకు మార్చుటయు చరిత్రప్రసిద్ధమైన విషయము. పెనుగొండ రాజధానిగా విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన యచ్యుత దేవరాయలు తంజావూరిలో చెవ్వప్ప నాయకుఁడను తన తోడియల్లుని నేలికగా నియుక్తునిజేసెను. ఆనాఁటినుండి యీ తెలుఁగు నాయకరాజులు దాదాపు నూటయేబది సంవత్సరములు తంజాపురీ రాజ్యమును పరిపా లించిరి. ఈ నాయక రాజులలో రఘునాథ భూపాలుఁడు మూఁడవవాఁడు. ఈతని తండ్రి అచ్యుతనాయకుఁడు. నాయక రాజులందఱును విద్యాపోష కులుగను, భక్తిసంపన్నులుఁగను పేరువడసిరి. దక్షిణదేశములో ప్రసిద్ధ ములైన క్షేత్రము లన్నింటిలోను గోపురప్రాకారాదులను నిర్మింపఁ జేసియు, మతపక్షపాతము లేక ప్రజల నందఱను సమానముగఁ గాపా డియు తటాక నిర్మాణాది ప్రజాహిత కార్యములను పెక్కుఁటిని గావిం చియు, సత్కృతులను వెలయింపఁజేసియు నాయకవంశ మాదర్శరాజ వంశముగ ఖ్యాతిగాంచినది.

విజయనగర రాజులలో శ్రీకృష్ణదేవరాయ లెట్టివాఁడో తంజా వూరి రాజులలో రఘునాథ భూపాలుఁడట్టివాఁడు. పరాక్రమమునం దేమి పండితపోషణమున నేమి, కావ్యరసాభిజ్ఞత్వమునం దేమి, ప్రబంధ రచనా దక్షత్వమున నేమి, శ్రీకృష్ణరాయలకు రఘునాథుఁడు సాటియనఁదగిన వాఁడు. దక్షిణదేశమున నాంధ్రసరస్వతిని బంగారుపల్లకిలో నూరేగింపఁ జేసి యాంధ్రప్రాభవముఁ జాటిన మహాపురుషుఁడీతఁడు. సముద్రము గూడ దాఁటిపోయి పోర్చుగీసులను తఱిమి కొట్టిన మహావీరుఁడు. దేవి కోట, తోపూరు మహాయుద్ధములలో శత్రుసంహారముఁ గావించి

విజయలక్ష్మిని చేఁబట్టిన వీరాగ్రేసరుఁ డీతఁడు. ఆపత్సమయములో సామ్రాజ్యాధిపతుల కండయై నిలచిన విశ్వాస పాత్రుఁడు.

ఈ రాజవరుని యాస్థానము వాణీవిలాసరంగమై వెలయు చుండెను. మహాపండితులు, మహాకవులు, గాయకోత్తము లెంద ఱెందఱో యీ రసికుని కొలువు కూటము నలంకరించి యుండిరి. ఆంధ్ర కవులలో పేరెన్నికగన్న చేమకూర వేంకటకవి రచించిన విజయవిలాస కావ్యమును అంకితము గొన్న సుకృతి యీతఁడు. రఘునాథుఁడు స్వయముగ సంస్కృతమునను, తెనుఁగునను కావ్యములు రచించెను. ఆతఁడొక్క రాత్రిలోనే యొక ప్రబంధమును నిర్మింపఁగల్గెనఁట. ఆతని సంస్కృత కృతులలో భారతసార సంగ్రహము వంటివియు, తెలుఁగు రచనలలో వాల్మీకి చరిత్రము వంటివియు ప్రసిద్ధములు. సంగీతశాస్త్రములోను నాతని పాండిత్య మపారము. ఆతనిపేర రఘునాథమేళ యను నొక క్రొత్తమేళమే రూపొందెను. ఈ మహారాజు చరిత్రమును రామ భద్రాంబయను విదుషీమణి సంస్కృతములో రఘునాథాభ్యుదయమను ప్రబంధముగా నిబంధించెను. ఈ రాజశ్రేష్ఠుని కాలము కళాలతలకు వసంతమైనదని చరిత్రకారు లుగ్గడింతురు.

పాఠ్యభాగ పరిచయము :—

పాఠ్యభాగము రఘునాథభూపాలుని వాల్మీకి చరిత్రమునందలి ద్వితీయాశ్వాసములోనిది. కిరాతుఁడై హింసానిరతుఁడై యున్న యొక దారిదొంగ ఋషులచే ప్రబోధితుఁడై తారక మంత్రోపదేశమును పొంది తజ్జప మాహాత్మ్యమున వాల్మీకి మహర్షిగా మాఱిన విచిత్రగాథ యిందు వర్ణితమైనది. ఋషులుసేవించిన వేంకటాద్రి, శ్రీశైలము, వారణాసి మున్నగు క్షేత్రముల వర్ణనము, గ్రీష్మఋతువు నందలి ప్రకృతియు, కిరాతుల హింసాప్రధాన చర్యలును, తపోనిష్ఠ నున్నప్పటి పరిస్థితులును, మిక్కిలి హృదయంగమముగా నిరూపింపఁబడినవి. పదప్రయోగము లోను, రసపోషణములోను రఘునాథ భూపాలుఁడు దిట్టయనుటకివి తార్కాణము.

---

# 4. శ్రీ దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

కవి పరిచయము :—

తమ కవితా ప్రభావమును నూతన రచయితలపై మెండుగ ముద్రించిన వర్తమాన మహాకవులలో శ్రీకృష్ణశాస్త్రిగారు మిన్నలు. పిఠాపురాస్థానమున పండితకవులై యుండి విశేష కీర్తినార్జించిన దేవులపల్లి సోదరకవులలో ద్వితీయులగు తమ్మన్నశాస్త్రి యను వాడుక పేరుగల శ్రీ వేంకట కృష్ణశాస్త్రిగారు వీరిజనకులు. ఆబాల్యము విద్వద్వాతావరణములో పెరిగిన శ్రీశాస్త్రిగారు వ్యుత్పన్నులైన కవులుగ భాసిల్లుట సహజము. అసాధారణమైన ప్రతిభయు, వంగడపు సొత్తై వచ్చుచున్న విద్వత్తయు వారి కవితలో కనఁబడుచుండును. కూచి నరసింహము, రఘుపతి వేంకటరత్నము నాయుడు మొదలగు మహాపురుషుల సాన్నిధ్య ప్రభావము శ్రీ శాస్త్రిగారిలో నూతనోత్తేజమును రేకెత్తింపఁ జేసినది. కవితలో క్రొత్త తెన్నులు చూపుచున్న గురుజాడ అప్పారాయ ప్రభృతుల ప్రభావ మొకయెడను, గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక వాదము లొకయెడను తాఁకి శాస్త్రిగారిని ప్రభావితులను గావించె ననుటకు వారి రచనలే సాక్షి. వంగదేశమునుండి నాఁడు వీచుచున్న బ్రహ్మసమాజ సిద్ధాంత మారుతములును, రవీంద్రుని కృతిచంద్రికలును కృష్ణశాస్త్రిని పులకరింపఁజేసి నూతన రచనల కుద్బోధకములైనవి.

వీరి రచనలలో కన్నీరు, కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, ఋగ్వేధి మున్నగునవి ప్రసిద్ధములు. వీరి హృదయమువలెనే కవితయు మిక్కిలి మృదువైనది. రసములలో వీరికి కరుణము ప్రీతిపాత్రము. సంస్కృతకవులలో భవభూతివలె నాధునికకవులలో శాస్త్రిగారు కరుణ రసపోషణమున సిద్ధహస్తులనిపించుకొనినారు. లలితపదములతో ప్రసాద గుణ భూయిష్ఠమై వీరికవిత యింపెసగుచుండును. శ్రీశాస్త్రిగారు

ప్రాచీనులలో ప్రాచీనులవలె లాక్షణికమైన కవిత్వమును వ్రాయగలరు. నవీనులలో నవీనులై గేయాది మార్గములను దీటుగ నడుపగలరు. కావుననే వీరి కలమునుండి యుభయమార్గములలోను మధుస్రవంతులు ప్రవహించినవి. శిల్పియై తన పద్యములను తీర్చి దిద్దుటలో వీరికి శ్రద్ధ మెండు. సరసకవిగను, ఉత్తమ భావుకుఁడుగను, చలనచిత్రములకు కథా సంధాతగను, శ్రీశాస్త్రిగారు పేరొందినారు.

## పాఠ్యభాగ పరిచయము :—

పాఠ్యభాగమునందున్న యన్వేషణము మున్నైన మూఁడు ఖండికలును వీరి కృష్ణపక్షములోనివి. ఇందు వీనిలో నన్నింట శ్రీశాస్త్రి గారి లలితపదవిన్యాసము, భావనా చమత్కృతియు గోచరించుచున్నవి.

---

# 5. శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రి

కవి పరిచయము :—

ఆధునిక కాలములో ప్రాచీన పద్ధతిని గ్రంథరచనముచేసి యఖండ యశస్సు నార్జించిన మహాకవులలో శ్రీగడియారము వేంకటశేషశాస్త్రిగా రొకరు. మహాకవికి వలయు ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు మూఁడును వీరికిఁ గలవు. చిన్ననాఁడే వీరు గురుశుశ్రూష గావించి కావ్యనాటకాలంకార సాహిత్యములందును, తర్క-వ్యాకరణ శాస్త్రములందును పాండిత్యము సంపాదించిరి. అంతియేగాక వేదాధ్యయనమును గూడఁ గావించిరి. ఆంధ్రగ్రంథములలో మహాభారతమనిన విరికాదరము మెండు పెక్కు సారులు మహాభారతమును చదివి కవిత్రయమువారి నుడికారమును స్వాయత్తీకరించుకొనినవారు కావుననే శాస్త్రిగారి కైత ప్రామాణికమైనదిగనేగాక ప్రమోదావహమైనదిగను భాసించినది. శ్రీశాస్త్రిగారు కడపమండలమునందలి నెమళ్ళదిన్నె యను గ్రామమున క్రీ. శ. 1897 న జన్మించిరి. ప్రొద్దుటూరిలో స్థిరపడిరి.

వీరు కొంతకాలము శ్రీ దుర్భాక రాజశేఖర కవితో కలసి యవధానములు చేయుచుండెడివారు. "రాజశేఖర వేంకటశేషకవులు" అను పేర నీజంటకవు లాంధ్రదేశములో ముఖ్యముగా రాయలసీమయందు పెక్కుచోట్ల అష్టావధాన శతావధానములంజేసి జయపత్రికలందిరి. వీరికి "అవధాన పంచానన" "కవిసింహ" అను బిరుదులున్నవి. వీరు భారవి, మల్లికామారుతము, పుష్పబాణవిలాసము, అనర్ఘరాఘవము, మున్నగు ననువాద గ్రంథములు రచించిరి. వీరికి తెలుఁగునాఁట అఖండ కీర్తిఁ గల్గుటకు వీరి "శివభారతమే" ముఖ్యకారణము.

నవ్యమైన యితివృత్తమును దీసికొని ప్రాచీనమైన శైలిలో నడపి యధునాతన రచయితలలో శాస్త్రిగారొక గడుసుపోక పోయినారు.

ఇందు భారతములోని కథాంశములను తలపించు పెక్కు ఘట్టములుండు టయు, శివాజీ చరిత మగుటయేగాక స్వధర్మరక్షారూపమున భారత దేశమునకు శివకరమగుటయు నీ గ్రంథమునకు "శివభారత" మనుపేరు సార్థకమైనది. పరదాస్య శృంఖలావిమోచనమునకై పాటుపడుచున్న భారతీయుల హృదయముల కుద్బోధకములుగా భారతీయులకు మహా వీరుల జీవితచరిత్రల కావశ్యకత గల్గిన సమయములో మహావీరుఁడును భారతీయ ధర్మరక్షా దీక్షితుఁడునునగు ఛత్రపతి శివాజీ మహారాజు వంటి నాయకాగ్రేసరుని జీవితచరిత్రను ప్రబంధముగా వెలయింపఁజేసి శ్రీశాస్త్రిగారు ప్రశంసాపాత్రులైరి.

పాఠ్యభాగ పరిచయము :—

గురూపదేశ మను నీ పాఠ్యభాగము శ్రీశాస్త్రిగారు వ్రాసిన "శివభారతము"లోని తృతీయాశ్వాసమునుండి గ్రహింపఁబడినది. ఇందు శివాజీ ప్రభువు కొంకణదేశమును జయించిన పిమ్మట సహ్యాద్రి వనము లలో వేఁటాడుచున్న సమయమున నట నొకయెడ లతల యాకులపై ముత్యాలకోవవలె చక్కఁగా వ్రాయఁబడిన పద్యములు కనఁబడుటయు నవి జాతి సంస్కృతి ధర్మములను రక్షించుఁడలఁచు తనకుద్బోధకములుగా నుండుటయు గ్రహించి శివాజీ యవి యా ప్రాంతములలోనే నివసించు చున్నాఁడని తాను వినిన రామదాసస్వామి వ్రాతలే యని నిశ్చయించు కొని వారిని దర్శింప వేడుకపడి యందందు నన్వేషించి స్వామి దర్శనము చేసి యమూల్యములైన యుపదేశములు పొందుటయు నను విషయములు పొందుపఱుపఁబడినవి.

---